సాధన గ్రంథ మండలి, 50.

# అర్థపంచకము



శ్రీ రామశరణ్
శ్రీ కుందుర్తి వేంకటనరసయ్య
సంపాదకుడు : "మోక్షసాధని"



ప్రకాశకులు
సాధన గ్రంథ మండలి, తెనాలి,

మూల్యము 0-12-0

# శ్రీ రాధా కృపా కటాక్ష స్తోత్రమ్

(శ్రీ ఊర్ధ్వామ్నాయ తంత్రము - శివగౌరీ సంవాదము)

మునీంద్ర బృంద వందితే త్రిలోక శోకహారిణి
ప్రసన్న వక్త్ర పంకజే నికుంజ భూవిలాసిని
వ్రజేంద్ర భానునందిని వ్రజేంద్రసూను సంగతే
కదా కరిష్యసీహ మాం కృపాకటాక్షభాజనమ్॥

అశోకవృక్ష వల్లరీ నితాంత మండపస్థితే
ప్రవాలజాల పల్లవ ప్రభారుణాంఘ్రి కోమలే
వరాభయ స్ఫురత్కరే ప్రభూత సంపదాలయే
కదా కరిష్యసీహ మాం కృపాకటాక్షభాజనమ్॥

అనంగరంగ మంగల ప్రసంగ భంగుర భ్రువా
సవిభ్రమం ససంభ్రమం దృగంతబాణపాతనైః
నిరంతరం వశీకృత ప్రతీతి నంద నందనే
కదా కరిష్యసీహ మాం కృపాకటాక్షభాజనమ్॥

తడిత్సువర్ణ చంపకప్రదీప్త గౌరవిగ్రహే
ముఖ ప్రభా పరాస్తకోటి శారదేందుమండలే
విచిత్ర చిత్ర సంచరచ్చకోర శావలోచనే
కదా కరిష్యసీహ మాం కృపాకటాక్షభాజనమ్॥

మదోన్మదాతియౌవనే ప్రమోదమానమండితే
ప్రియానురాగరంజితే కలావిలాస పండితే
అనన్యధన్యకుంజరాంగ కామకేలి కోవిదే
కదా కరిష్యసీహ మాం కృపాకటాక్షభాజనమ్॥

మృణాల వాలవల్లరీ తరంగ రంగదోర్లతే
లతాగ్రలాస్య లోలనీలలోచనావలోకనే
లలల్లులన్మిలన్మనోజ్ఞ ముగ్ధమోహనాశ్రితే
కదా కరిష్యసీహ మాం కృపాకటాక్షభాజనమ్॥

విశేష హావ భావ ధీర హీర హార భూషితే
ప్రభూత సాత కుంభ కుంభ కుంభి కుంభ సుస్తని
ప్రశస్త మందహాస చూర్ణ పూర్ణసౌఖ్యసాగరే
కదా కరిష్యసీహ మాం కృపాకటాక్షభాజనమ్॥

స్వర్ణమాలికాంచిత, త్రిరేఖకంబుకంఠగే
త్రిసూత్ర మంగలీ గుణ త్రిరత్న దీప్తిదీధితే
సలోల నీలకుంతలే ప్రసూన గుచ్ఛ గుంఫితే
కదా కరిష్యసీహ మాం కృపాకటాక్షభాజనమ్॥

నితంబ బింబలంబమాన పుష్పమేఖలాగుణః
ప్రశస్త రత్నకింకిణీ కలాప మధ్య మంజులే
కరీంద్రశుండ దండికా వరోహ సౌభగోరుకే
కదా కరిష్యసీహ మాం కృపాకటాక్షభాజనమ్॥

అనేక మంత్ర నాద మంజు నూపురారవస్ఖలత్
సమాజరాజహంస వంశ నిక్వణాతిగౌరవే
విలోల హేమ వల్లరీ విడంబి చారు చంక్రమే
కదా కరిష్యసీహ మాం కృపాకటాక్షభాజనమ్॥

అనంతకోటి విష్ణులోక నమ్ర పద్మజార్చితే
హిమాద్రిజా పులోమజా విరించిజా వరప్రదే
అపార సిద్ధి వృద్ధి దిగ్ధ సత్పదాంగుళీనఖే
కదా కరిష్యసీహ మాం కృపాకటాక్షభాజనమ్॥

మఖేశ్వరీ క్రియేశ్వరీ స్వధేశ్వరీ సురేశ్వరీ
త్రివేద భారతీశ్వరీ ప్రమాణ శాసనేశ్వరీ
రసేశ్వరీ క్షమేశ్వరీ ప్రమోద కాననేశ్వరీ
వ్రజేశ్వరీ వ్రజాధికే శ్రీ రాధికే నమోస్తుతే॥

ఇతీద మద్భుతస్తవన్నిశమ్య భానునందినీ
కరోతి సంతతం జనం కృపాకటాక్షభాజనమ్
భవేత్తదైవ సంతతం త్రిరూప కర్మ నాశనమ్
లభేత్తదా వ్రజేంద్ర సూనుమండలప్రవేశనమ్॥

రాకాయాం చ సితాష్టమ్యాం దశమ్యాంచ విశుద్ధితః
ఏకాదశ్యాం త్రయోదశ్యాం యః పఠేత్సాధకః స్వయమ్॥
యం యం చింతయతే కామం తం తం ప్రాప్నోతి సాధకః
రాధాకృపాకటాక్షేణ భక్తిః స్యాత్ప్రేమ లక్షణా॥

ఊరు మాత్రే నాభిమాత్రే హృన్మాత్రే కంఠమాత్రకే
రాధాకుండ జలేస్థిత్వా యః పఠేత్సాధకః స్తవమ్॥
తస్య సర్వార్థసిద్ధిః స్యాత్ వాంఛితార్థఫలం లభేత్
ఐశ్వర్యంచ లభేత్సాక్షా దృశా పశ్యతి రాధికామ్॥
తేనసా తత్క్షణాదేవ తుష్టా దత్తే మహావరమ్
యేనపశ్యంతి నేత్రాభ్యాం తత్ప్రియం శ్యామసుందరమ్॥
నిత్యలీలాప్రవేశంచ దదాతి శ్రీ వ్రజాధిపా
అతః పరతరం ప్రాప్యం వైష్ణవస్య న విద్యతే॥

(శుక్లపక్ష అష్టమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, పూర్ణిమ యీతిథులయందు ముఖ్యముగ పఠించిన కోరికలు సిద్ధించును.)



## ఒక మాట

సాధకుడు తొలుత తాజేయు సాధన విధానమును తెలిసికొని, చేసిన అచిరకాలములో తప్పక ఫలించును. ప్రతి సాధకుడు ముఖ్యముగ గమనించవలసిన విధాన మంతయు నీ చిన్ని గ్రంథమున చక్కగా పొందు పరుప బడినది. శ్రీ వేంకటనరసయ్యగారు ఉత్తమ ఆదర్శ సాధకులు. వీరి రచనలన్నియు వారి సాధన క్షీరసాగరమున వెలువడిన అమృత స్వరూపములే.

వందన
గీతాజయంతి 

బులుసు సూర్యప్రకాశ శాస్త్రి
సంపాదకుడు : సాధన గ్రంథ మండలి.

# ప్రస్తావన

శ్లో॥ రామాయ రామభద్రాయ । రామచంద్రాయ వేధసే
రఘునాథాయ నాథాయ । సీతాయాః పతయే నమః॥

ఉపాసన చేయవలయునని ముందు ముఖ్యముగ ఉపాస్య వస్తువు యొక్క స్వరూపమును, తర్వాత ఉపాసన చేయువాని స్వరూపమును, ఉపాసనచేయు మార్గమును, ఆ ఉపాసన చేయుటచేఁ గలుగు ఫలమును, ఉపాసన చేయుటలోఁ గలుగు విఘ్నములను గూర్చియు బాగుగాఁ దెలిసికొనవలయును.

ఈ అయిదు విషయములకే అర్థపంచకమని పేరు. దీనిని దెలిసికొనకున్న సాధన వెలవేరదు. అనేక లోపములు తటస్థింప గలవు. విక్షేపము చెందుట కవకాశము కలదు. అందువలన ముఖ్యముగ శ్రీరామోపాసకులకుఁ గావలసిన విషయ మిందు పొందుపఱుపఁబడినది.

శ్రీరామపరతత్త్వమును గూర్చి యిందు విపులముగఁ జర్చింపఁబడినది. శ్రీరాముడే పరబ్రహ్మయనియు, అతఁడు సర్వదేవతాక స్వరూపుఁడనియు, అన్నిమతములవారు, అన్ని సాంప్రదాయములవారును భజింపఁదగిన వాఁడనియు నిందు నిరూపింపఁబడినది. దీనికి తోడుగా మాచే నిదివఱకు వ్రాయఁబడిన శ్రీరామ నామ ప్రభావము, కలిసంతరణోపనిషత్తు, పరమార్థతత్త్వము, శ్రీరామ మంత్రానుష్ఠానము, తత్త్వత్రయము అను గ్రంథములను జదువుట రామోపాసకులకు చాల అవసరము.

ఇంతకంటె నీ ప్రస్తావనలోఁ జెప్పవలసిన దేమియును లేదు. కాని ఒక్కవిషయము మాత్రము పాఠకులకు విన్నవింపఁదలంచినాను. ఈ గ్రంథములోని గుణ దోషములను గుణగ్రహణ పారీణులు గ్రహించి యందు దోషములను నాకుఁ దెల్పిన వాటిని సవరించుకొనుటకు సిద్ధముగా నున్నానని మనవి చేయుచున్నాను.

నందన
మార్గశిరము
24-11-52

ఇట్లు
శ్రీరామశరణ్
కొండమర్తి వేంకటనరసయ్య



ఆపదా మపహర్తారం
దాతారం సర్వసంపదాం
లోకాభిరామం శ్రీరామం
భూయో భూయో నమామ్యహమ్॥



శ్రీ రావుసాహెబ్ శ్రీకందుర్తి వెంకట నరసయ్య

ఓమ్

# అర్థపంచకము

శ్రీరామోపాసకులు శ్రీరామానుగ్రహము పొంద వలయు ననిన నేసాధనము చేయవలయునో ప్రతిసాధకుఁడును దెలిసికొనవలెను. సంసారము నందు విరక్తి కలిగినఁగాని భగవంతుని యందు అనురక్తి కలుగఁజాలదు. ఈ విషయమునే అగస్త్యుఁ డడుగఁగా శ్రీరామ పాదసేవా ధురంధరుఁడగు ఆంజనేయుఁడు అగస్త్యునకు వివరముగా నర్థపంచకమును వివరించెను. ఆవిషయమే యీక్రింద చెప్పఁబడు చున్నది.

అగస్త్యుఁ డిట్లు ప్రశ్నించెను:—

శ్లో॥ కథం శ్రీరామే సంప్రీతి, ర్జాయతే పవనాత్మజ!
గృహదార కుటుంబేషు, వైరాగ్యశ్చ కథం భవేత్॥

తా॥ ఓ ఆంజనేయా! శ్రీరామునియందు ప్రేమ యెట్లు జనింపఁగలదు? గృహదార కుటుంబాదులయందు వైరాగ్య మెట్లు కలుగఁగలదు? పవనకుమారా! ఆంజనేయా! నీవు సకల ప్రాణులకును బ్రాణాధారుఁడగు వాయుదేవుని కుమారుఁడవు. నీ తండ్రి శరీరము నెట్లు నిలుపఁగలఁడో నీవు నీ సదుపదేశముచే నట్లే ఆత్మను బతనము కాకుండ నిలుపఁ గలుగుదువు. కావుననే నేను నీ వద్దనా తత్త్వమును దెలిసి కొనుటకు వచ్చియున్నాను. నీవు శ్రీరామ భక్తుఁడవు కావు నను, శ్రీరామ నామ తత్త్వమును బాగుగాఁ దెలిసినవాఁడవు

కావునను, తెలియుటయేగాక శ్రీరామచంద్రుని సేవించి వశ పఱచు కొనినవాఁడవు కావున నాయన యనుగ్రహమును బొందఁ గలుగు విధముగ ననుష్ఠించు విధానమును నీకంటె నింకెవరికిని అధికముగఁ దెలియఁజాలదు. కావున నిప్పుడు నాకు శ్రీరామునియందు ప్రీతి యెట్లు కలుగునో తెలుప వల యును. గృహదారాదు లందును కుటుంబము నందును వైరాగ్య మెట్లు కలుగునదియుఁ జెప్పవలయును. గృహ దారా పుత్రాదులందు ప్రీతి యున్నంతవఱకు శ్రీరాముని యందు ప్రీతి కలుగఁజాలదు శ్రీరామునియందు నిజమగు ప్రీతి యుండిన సాంసారిక విషయములందు ప్రీతి యుండదు. వైరా గ్యశ్చ అనుచోటఁ బ్రయోగించిన చకారము వలన సంసార బంధములగు బంధు మిత్ర కళత్రాది సమస్త విషయ సుఖ ములు అను నర్థమును గ్రహింప వలయును.

శ్రీ హనుమానువాచ.

హనుమంతుఁ డిట్లు పలుకుచున్నాఁడు:—

శ్లో॥ కుంభోద్భవ పరంశ్రేయః, శృణుష్వ తే వదామ్యహమ్,
గోపనీయం గోపనీయం, గోపనీయశ్చ సర్వదా॥

జ్ఞేయం ప్రాప్యస్య రామస్య, రూపం ప్రాప్తు స్స్వరూపవచ,
ప్రాప్త్యుపాయం ఫలం చైవ, తథా ప్రాప్తి విరోధిచ॥

అర్థపంచక మేతత్తు, సంక్షేపేణ వదామి తే॥

తా॥ కుంభ సంభవుఁడవగు నో అగస్త్యమునీంద్రా! నేను నీకు పరమశ్రేయమును గూర్చి చెప్పెదను వినుము.

ది గోపనీయమైనది. ప్రాప్త్యుఁడగు రాముని రూపమును తెలిసికొన వలయును. ప్రాప్యుఁడు, ప్రాప్త్యుపాయము, ప్రాప్తిఫలము, ప్రాప్తివిరోధము, అను నీ అర్థపంచకమును గూర్చి సంక్షేపముగఁ జెప్పెదను.

హనుమంతుఁడు దీనిని రహస్యముగ నుంచవలయు నని కోరుచున్నాఁడు. కారణ మేమనఁగా నీ అర్థపంచకమును అనధికారులకు వినిపింపరాదు. నాస్తికులకును, పాషండులకును, అవిశ్వాస పరులకును వినిపించిన అరణ్యరోదనమే కాఁగలదు. అట్టి వారెల్లప్పుడును సాంసారిక విషయములనే సత్యముగఁ దలఁచుచు విషయానురక్తులై యుందురు. విషయ వాసనా పరులకు దీని నుపదేశించుట వ్యర్థమే కాఁగలదు. ఇది సర్వశాస్త్రములలోని గోపనీయ విషయమగుటచే జాగ్రత్తగ దాఁచవలయును. విశేషమగు విలువగలిగిన దానిని మనము జాగ్రత్తగ దాఁచుకొను చుందుము. ఇదియును మిగిలిన ధర్మములు, మిగిలిన భగవత్సాధనలకంటె విలువైనది. కావున నిది మిక్కిలి గోపనీయమైనది. గోపనీయమైన దను దానికర్థ మేమనఁగా అభక్తులకు దీని నొసంగ రాదనియు, భక్తులు, సాధకులైన వారెవరు కలరో వారు బాగుగా దీనిని ధరించి అనుష్ఠానములోఁ బెట్టుకొనవలయు ననియు భావము. గోపనీయమని మూఁడు సార్లు చెప్పుటచేఁ త్రికరణముల (మనో వాక్కాయముల) చే దాఁచఁ దగినదని భావము.

ముందుఁగా ప్రాప్యవస్తువును గూర్చి తెలిసికొనవలయును. ఇన్ని సాధనలయొక్క లక్ష్య మేవస్తువును బొందు

టకు తెలిసికొనవలయును. ప్రాప్యవస్తువు పరంబ్రహ్మ. మిగిలిన వన్నియు నశించునవియే. నశించెడు స్థానమును బొందిన నాశము కదా కలుగునది. మనకు శాశ్వతత్వము లభింపవలయును. శాశ్వతత్వము అనగా సత్పదార్థమును బొందవలయుననిన సద్వస్తువునే ఆశ్రయింప వలయును. సద్వస్తువు నాశ్రయింపవలయుననిన ముందా వస్తు తత్త్వమును గూర్చి బాగుగా దెలిసికొనవలయును. ఇక బ్రాప్తవస్తువు అనగా జీవస్వరూపమును గూర్చియు దెలిసికొనవలయును. జీవుని లక్షణములు తెలిసికొనిన తరువాత మిగిలిన విషయములు తెలిసికొన వలసియుండును. మనము 'నేను' అనగా శరీరమునే భావింతుము. శరీరము నశించును. జీవుడు నశింపడు. జీవుడు ఈశ్వరాంశ యనియు, అవినాశి యనియు, నిత్యుడనియు, చేతనుడనియు గ్రహింప వలయును. ఇక మూడవది ప్రాప్త్యుపాయము. అనగా జీవుడు పరబ్రహ్మ నెట్లు పొందగలుగును? వానికి సులభమగు నుపాయ మెద్దియను సంగతి తెలిసికొన వలసియుండును. నాల్గవది అట్లు ప్రాప్తించుటవలన ఫలమేమి కలదు? అనునదియు దెలిసికొన వలయును. ప్రయోజన రహితముగ నెవ్వడు నేకార్యమును జేయజాలడు. కావున ఫలమును గూర్చి తెలిసికొనుట చాల అవసరము. ఐదవది ప్రాప్తి విరోధులను గూర్చి తెలిసికొన వలయును. సచ్చిదానందుని జేరదలచినను, జేరు జీవుని స్వరూపమునుగూర్చి తెలిసికొనినను, ప్రాప్త్యుపాయ ఫలములనుగూర్చి తెలిసికొనినను, విఘ్నరూపములగు ప్రాప్తి విరోధు

లనుగూర్చి తెలిసికొనకున్న గమ్యస్థానమును జేరుట కష్టమే. కాఁబట్టి యీ ఐదింటిని గూర్చి చెప్పెదను. ముందుగా ప్రాప్యునిఁ గూర్చి చెప్పెదను.

శ్లో॥ దివ్యానంత గుణః శ్రీమాన్, దివ్యమంగళ విగ్రహః,
మడ్గుణైశ్వర్య సంపన్నో, మనోవాచామ గోచరః।
వేద వేద్యః సర్వసాక్షీ, సర్వోపాస్యః స్వతంత్రకః,
నిత్యానాం నిజభక్తానాం, భోగ్యభూతః శ్రియఃపతిః॥

తా॥ శ్రీరాముఁడు దివ్యములగు ననంతగుణములు కలవాఁడు. శ్రీమంతుఁడు. దివ్యమంగళ విగ్రహుఁడు. షడ్గుణైశ్వర్య సంపన్నుఁడు. వాక్కునకును, మనస్సునకును, కంటికిని అందనివాఁడు. జ్ఞానముచేతనే తెలియ దగినవాఁడు. సర్వసాక్షి. అందఱిచే సేవింపఁబడువాఁడు. స్వతంత్రుఁడు. నిత్యులగు నిజభక్తులాతని ననుభవింతురు. ఆతఁడు లక్ష్మీదేవికి భర్త.

మనకు ప్రాప్యుఁడు శ్రీరామచంద్రమూర్తి. ఈతఁడే పరంబ్రహ్మ. ఈవిషయమున శ్రుతు లిట్లు చెప్పుచున్నవి.

శ్రు॥ రామ ఏవ పరం బ్రహ్మ రామఏవ పరంతపః,
రామఏవ పరం తత్త్వం, శ్రీరామో బ్రహ్మతారకమ్॥

శ్రీరాముఁడే పరంబ్రహ్మ. శ్రీరాముఁడే పరమతపస్సు. శ్రీరాముఁడే పరమతత్త్వము. శ్రీరాముఁడు తారకబ్రహ్మ. మన శ్రీరాముఁడు స్వాభావిక, అనవధిక, అసంఖ్యేయ దివ్య కల్యాణ గుణ సంపన్నుఁడు. ఆయన గుణములు ప్రాకృతికములు కావు. అనఁగా సత్త్వరజస్తమస్సులచే నేర్పడినవి కావు. ఆతఁడు

త్రిగుణాతీతుఁడు. ఆతని గుణములును ద్రిగుణాతీతములే. ప్రకృతి గుణములన్నియు జడములే. కాని శ్రీరాముని గుణములు దివ్యములు. అవి ఒకటి, రెండు కావు. అసంఖ్యాకములగు గుణములు కలవు. పృథివీ రేణువుల నైనను, సర్వసాగరములలోని జలకణములనైన లెక్కింప వచ్చునేమో కాని, ఆతని గుణములను లెక్కింపఁ జాలము. అందువలన నవి యనంతములు. అందులో నా గుణములు స్వాభావికములే కాని ఆగంతుకములు కావు. అన్నియుఁ గల్యాణమయములే. ఆగుణములు జ్ఞాన, శక్తి, బలైశ్వర్య, వీర్య, తేజ, సౌశీల్య, మార్దవ, ఆర్జవ, వాత్సల్య, సౌహార్ద్ర, సౌమ్యత్వ, కారుణ్య, సర్వేశ్వరత్వ, సర్వపాలకత్వ, ధైర్య, స్థిరత్వాది గుణము లనంతములుగఁ గలవు. ఆతఁడు శ్రీమంతుఁడు. మత్ ప్రత్యయమువలన నెప్పుడో ఒకప్పుడు శ్రీయుండి మఱియొకప్పుడు లేకపోవుట కాదు. నిత్యశ్రీమాన్ ఆతఁడు. లక్ష్మి (సీతా) దేవి నిత్యానపాయినిగ నుండును. నిజమున కామె ఆతనిని వదలి ఒక్క నిమిషమైన నుండఁజాలదు. ఆమె ఆతనిని వదలిన నామెను శ్రీత్వమే పోవును. ఆమె ఆతని నాశ్రయించుటచే నామెమీఁద నామె కాధిపత్యము గలదు. ఈలోకములోని తుచ్ఛ సంపత్తులకై మనము పరువు లిడుచున్నాము. ఇంద్రాది పదవులన్నియు నా యమ్మ క్రీగంటి ప్రసారమహిమములే. ఈతుచ్ఛ భూలోక సంపత్తుల లెక్కయేమి కలదు. అట్టి యామె యాతనిని వదలఁజాలదు. నిజమున కాతనికిని ఆమెకును భేదములేదు.

ఆతఁడు దివ్యమంగళ విగ్రహుఁడు. ఆతఁడు మంగళమయుఁడు కావుననే నిత్యము సేవించుటకు యోగ్యుఁ డగుచున్నాఁడు. ఆతని నాశ్రయించినఁ గల్యాణమే లభించును. అట్టి కల్యాణమును స్వరూపముగఁ గలవాఁడు. అందువలన సేవా సౌకర్యములన్నియు నావిగ్రహమందు గలవు.

ఆతఁడు షడ్గుణైశ్వర్య సంపన్నుఁడు. షడ్గుణైశ్వర్యములనఁగా (1) పోషణత్వము. (2) భరణత్వము. (3) ఆధారత్వము (4) శరణ్యత్వము (5) సర్వవ్యాపకత్వము (6) కారుణికత్వము. భగవానునికిఁగల షడ్గుణములలో 'ఐశ్వర్యస్య సమగ్రస్య' అను దానిలో సమగ్రమగు నైశ్వర్య మనఁగా నైశ్వర్యములోఁగల నీ యాఱులక్షణములు కలిగియుండుటే సమగ్రత్వము. ఇట్టి షడ్గుణైశ్వర్యము లుండుటచే నాధారరహితుఁ డగు జీవుని కాధారము లివియే కావున నీతఁడు ఆశ్రయింపఁ దగినవాఁడని తెలియుచున్నది.

ఆతఁడు మనస్సునకుఁగాని, వాక్కునకుఁగాని అందఁడు. మనస్సు ఆతని నూహింపఁజాలదు. అనంత దివ్యరూపము పరిమితిగల మనస్సున కెట్లు గోచరింపఁగలదు. ఎచ్చటనైన సముద్రము చిన్ని చెంబులో నిముడునా ? అట్లే అపరిమితమగు శ్రీరామ స్వరూపము పరిమితిగల మనస్సున నెట్లిమిడఁగలదు ? పోనిండు వాక్కులతో నాతని కల్యాణగుణములను వర్ణింతమందుమా ఆగుణములు వాక్కుల కందవు. ఆతఁడు మనోవాక్కులకు విషయముకాఁడు. అయితే యెట్లు తెలియఁబడునందురా ?

వేదవేద్యః అతఁడు వేదముచేతనే తెలియఁబడును. అనఁగా జ్ఞానముచేఁ దెలియఁబడును. సమస్త వేదములును అతనినే ప్రతిపాదించు చున్నవి. అతఁ డనుభవరూపమునఁ దెలియఁబడును.

ఆయన సర్వసాక్షిగా నున్నాఁడు. సాక్షికి లౌకికమం దును బంధమోక్షము లుండవు. ఫిర్యాదు ముద్దాయీలకే బంధమోక్షములు. అట్లే అహంకార మమకారములకును ప్రపంచమునకును, దేహాదీంద్రియ ములకును, మనోబుద్ధి చిత్తాహంకారములకును జీవునకును అంటకయే సాక్షిమా త్రుఁడై యున్నాఁడు. సర్వసాక్షి యనుటచేఁ జేతనా చేతన ములను, జూచుచున్నాఁడని భావము.

శ్రీరాముఁడు సర్వోపాస్యుఁడు. ఈ శ్రీరాముఁడే ఆయా మతములవారిచే నాయా రూపములలో భజింపఁబడు చున్నాఁడు. వైష్ణవులు విష్ణువుగను, శైవులు శివునిగను, గాణాపత్యు గణపతిగను, సౌరులు సూర్యునిగను జ్ఞాను లాత్మారామునిగను ఇతరమతములవారు వారివారి యిష్టదైవ ములగను భావించు చున్నారు.

శ్లో॥ రమతే రమయా సార్ధం, తేన రామం విదు ర్బుధాః,
రమాణాం రమణస్థానం, రామం రామ విదోవిదుః॥

శ్లో॥ రా చేతి లక్ష్మీ వచనో, మశ్చాపీశ్వర వాచకః
లక్ష్మీగణపతిం రామం, ప్రవదంతి మనీషిణః॥

— బ్రహ్మవైవర్తము

జ్ఞానులు రమాదేవితో రమించు వానిని రామునిగాఁ దెలిసికొను చున్నారు. సంపదలన్నిటికిని బ్రియమగు స్థానము కావున రాముని రామునిగా భావించుచున్నారు. 'రా' యనఁగా లక్ష్మి. 'మ' యనఁగా నీశ్వరుఁడు. సంపదల గణము లకు పతి కావున రాముఁడని పెద్దలు చెప్పుచుందురు.

పైన వ్రాసిన దానిని బట్టి రాముఁడు శ్రీమహావిష్ణు వని తేలుచున్నది. ఇఁక శివుఁడనుటకును నాధారములు కలవు.

శివుఁడిట్లనెను:-

శ్లో॥ అహంమానుషరూపేణ-రామోభూత్వాహరామ్యహమ్,
రామో దాశరథిశ్చాహం-కౌసల్యానంద వర్ధనః॥

పాద్మ—ఉత్తరఖండము

నేను మనుష్యరూపముతో రాముఁడనై రాక్షసులను జంపెదను. దశరథకుమారుఁడును కౌసల్యానంద వర్ధనుఁడగు రాముఁడను నేనే.

శ్లో॥ రామో మమాంశ సంభూత, స్సీతాచ గిరిజాంశజా.

రాముఁడు నాయంశవలన నయ్యెను. సీతాదేవి పార్వతీ దేవియొక్క అంశ.

శ్లో॥ శివం మాం ప్రతిజానీథ, నావయో రంతరం ద్విజాః,
ఆవయో రంతరం జ్ఞానం, తదేవాజ్ఞాన మిష్యతః॥

—దుర్వాస రామాయణము

శ్రీరామచంద్రుఁ డిట్లు పలుకుచున్నాఁడు:-

ఓ బ్రాహ్మణులారా! నన్ను శివునిగా తెలుసుకుడు. అజ్ఞాన మనఁగా మాకిద్దరకును భేద మెంచుటయే.

శ్లో॥ రామ ఏవ హరో జ్ఞేయః, శ్శివ ఏవ రఘూత్తమః,
ఉభయో ర్నాంతరం జ్ఞేయం, భేదకృ న్నారకీ నరః॥
రామ శంకరయో ర్మధ్యే, భిన్నత్వం యేన మానితం,
అజాగళ స్తన మివ, తస్య జన్మ నిరర్థకమ్॥

రాముఁడే శివుఁడని తెలిసికొన వలయును. శివుఁడే రాముఁడని తెలిసికొనవలెను. ఇద్దరకును భేదము లేదని తెలిసికొనవలెను. అట్లు భేదమెంచినవాఁడు నరకమునఁ బడఁగలఁడు. రామునకును శంకరునకును భిన్నత్వము నెవఁడు పాటించునో మేఁక మెడక్రింది చన్నులవలె వాని జన్మము నిరర్థకము కాఁగలదు.

శ్లో॥ కాలాత్మా సర్వదేవాత్మా సర్వకాలేషు మాం సదా,
శివ విష్ణ్వాత్మకః పాయాత్, శ్రీరామో భక్తవత్సలః

కాలాత్ముఁడును, సర్వదేవతా స్వరూపుఁడును, శివ విష్ణ్వాత్మకుఁడును, భక్తవత్సలుఁడు నగు శ్రీరామచంద్రుఁడు సర్వకాలములందు సదా నన్ను రక్షించుగాక!

శ్లో॥ తత్రైవ చక్రతూ రాజన్ రామో హరిహరాత్మకః,
శివరూపేణ సంహారం విష్ణురూపేణ పాలనమ్॥

—స్కాందపురాణము

ఓ రాజా! హరి హరాత్మకుఁడగు రాముఁడు శివరూపమున రాక్షససంహారమును, విష్ణురూపమునపాలనమును చేసెను.

అసలు రామనామమే శివనారాయణ మంత్రముల లోని ప్రాణబీజములతో నేర్పడినది. నారాయణ మంత్రము నుండి 'రా' యను బీజమును, శివ పంచాక్షరినుండి 'మ' యను బీజమును కలిసి 'రామ' అయినది. "శివమంత్రము నకు 'మ' జీవము, మాధవమంత్రమునకు 'రా' జీవము, ఈవివరము తెలిసిన జనులకు మ్రొక్కెద" యని శ్రీ త్యాగరాజులవారనిరి.

శ్రీరామచంద్రుఁడు త్రిమూర్తి స్వరూపుఁడనుటకును ఆధారములు కలవు.

శ్లో॥ బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ, త్వమేవ రఘునందన!,

— స్కాందము

రామా! బ్రహ్మ, విష్ణు, రుద్రులు ముగ్వురును నీవే.

శ్రు॥ రామం త్రినేత్రం సోమార్థ ధారిణం శూలినం పరమ్,
భస్మోద్ధూళిత సర్వాంగం కపర్దినా ముపాస్మహే॥

— రామరహస్యోపనిషత్తు.

మూఁడుకన్నులు కలవాఁడును, అర్థచంద్రుని ధరించిన వాఁడును, శూలమును ధరించినవాఁడును, పరుఁడును, శరీర మంతటను భస్మము పూసికొనిన వాఁడును, జడలు ధరించిన వాఁడు నగు శ్రీరామచంద్రుని యుపాసించు చున్నాను.

త్రిమూర్తులు వారివారి అంశములలో మూఁడుసార్లు రామ నామమును ధరించి అవతరించిరి. శ్రీరాముఁడు పరాత్పరుఁడు.

శ్లో॥ (౪) భ్రాతరస్త్రయోరామ, బ్రహ్మవిష్ణు రహం తథా,
త్వత్తో వినిర్గతా హ్యేతే, త్వయ్యేవ విలయం గతాః॥
త్వమేవ పరమం గుహ్యం. త్వమేవ పరమం పదమ్,
త్వమేవ పరమం బ్రహ్మ త్వమేవ శరణంహి నః॥
—స్కాందము, నిర్వాణఖండే శ్రీరామంప్రతి శివః.

శివుడు శ్రీరామునితో నిట్లనెను :—

ఓ రామా! బ్రహ్మ, విష్ణువు, శివుడను నేను నీకు సోదరులము. మేము ముగ్గురము నీలోనుండియే బయలుదేరి వచ్చితిమి. చివరకు నీలోనే చేరుదుము. గుహ్యమగు వస్తువు నీవే. నీవే పరమ పదమును. నీవే పరబ్రహ్మవు. మేము నిన్నే శరణు వేడుచున్నాము.

శ్లో॥ భార్గవోఽయం పురా భూత్వా, స్వీచక్రే నామ తే విధిః,
విష్ణు ర్దాశరథి ర్భూత్వా, స్వీకరో త్యధునా పునః॥
సంకర్షణ స్తతశ్చాహం, స్వీకరిష్యామి శాశ్వతమ్,
ఏకమేవ త్రిధా జాతం, సృష్టి స్థిత్యంత హేతవే॥
— స్కాందము నిర్వాణఖండము రామగీత.

శివుడు రామునితో నిట్లనెను :—

పూర్వము బ్రహ్మ పరశురాముడయ్యెను. నీవు విష్ణుడవై మరల నిప్పుడు దాశరథివైతివి. నేను (శివుడను) బలరాముడ నయ్యెదను. సృష్టిస్థితి సంహారము లొనర్చుటకొక్కడే ముగ్గురుగ నైతిమి.

భారద్వాజ సంహితలో నిట్లు చెప్పఁబడినది :—

శ్లో॥ నారాయణోఽపి రామాంశః, శంఖచక్ర గదాబ్జధృక్,
చతుర్భుజ స్వరూపేణ, వైకుంఠేచ ప్రకాశతే॥
అవతారా బహవస్సంతి, కలాశ్చాంశ విభూతయః,
రామ ఏవ పరం బ్రహ్మ సచ్చిదానంద మవ్యయమ్॥

శంఖ చక్ర గదాపద్మ ధారియగు నారాయణుఁడును శ్రీరాముని అంశయే. ఆతఁడు చతుర్భుజ స్వరూపుడై వైకుంఠములో నుండును. అవతారము లనేకములు. అవన్నియుఁ గళావతారములు, అంశావతారములు, విభూతులు. శ్రీరాముఁడే సచ్చిదానంద మయుఁడగు పరబ్రహ్మము.

శ్లో॥ రామస్య నామరూపం చ, లీలాధామ పరాత్పరమ్,
ఏత చ్చతుష్టయం నిత్యం, సచ్చిదానంద విగ్రహమ్॥

శ్రీరాముని నామము, రూపము, లీలలు, ధామము పరాత్పరములు. ఈ నాలుగును నిత్యములు, సచ్చిదానంద విగ్రహము.

శ్లో॥ నారాయణ ముఖా దీర్ణం, ప్రోచ్యతే యచ్ఛ్రుతం మయా,
తతః కించి త్ప్రవక్ష్యామి, శృణు బ్రహ్మర్ష మహాబుషే॥
చిన్మయానంద సారాత్మా హ్యనంత మాధుర్య విగ్రహః,
పరిపూర్ణతమ బ్రహ్మంచ స్వయం రామః సనాతనః॥
— బ్రహ్మ సంహిత.

బ్రహ్మ నారదునితో నిట్లనెను :—

"ఓ నారదా! నారాయణుని నోటపలుకఁగా వినిన విషయము చెప్పెదను వినుము. చిన్మయుఁడును, ఆనంద స్వరూపుఁడును, సారాత్ముఁడును, అనంత మాధుర్య విగ్రహుఁడును, పరిపూర్ణమగు పరబ్రహ్మయు, సనాతనుఁడును స్వయముగ శ్రీరామచంద్రుఁడే.

సూర్యోపాసకులకును శ్రీరామచంద్రుఁ డారాధ్యుఁడే. సూర్యుఁడును బరమాత్మయే. "సూర్యో గ్రహపతి శ్రీమాన్" అని కలదు.

"ఆదిత్యాది గ్రహాస్సర్వే త్వమేవ రఘునందన."

ఆదిత్యాది గ్రహములన్నియును ఓరామా! నీవేకదా!

గాణాపత్యులును శ్రీరామునే భజింతురు. శ్రీరామమంత్రము గాణాపత్యమంత్రములలోఁ జేరినదే.

"గాణాపత్యాది మంత్రేషు, కోటికోటి గుణాధికః॥

గాణాపత్యాది మంత్రములలో శ్రీరామ మంత్రము కోటానకోట్ల రెట్లు ఫల మధికముగ గలదగును.

శాక్తేయులును శ్రీరాముని శక్తిగా భావించి యుపాసించు చుందురు. శ్రీమద్రామాయణము గాయత్రీ మంత్రార్థయుక్తమై యున్నది. గాయత్రీ మంత్రాక్షరములందులోఁ గలవు. శాక్తేయులు దేవీనవరాత్రములలో దేవీ భాగవతమునకు బదులుగ శ్రీమద్రామాయణమునే పారాయణము కావింతురు. దేవీమంత్ర రహస్యములలో శుద్ధ సాత్త్విక శక్తులగు శ్యామలా, లలితా దేవులను గూర్చి "శ్రీకృష్ణ శ్యామలాదేవీ

శ్రీరామో లలితాంబికా" శ్రీకృష్ణుఁడు శ్యామలాదేవి యంశ మనియు, శ్రీరాముఁడు లలితాదేవియొక్క అంశమనియుఁ జెప్పుదురు.

పైవిషయమును బట్టి వైష్ణవ, శైవ, అద్వైత, సౌర, గాణాపత్య, శాక్తేయులు అనఁగా షణ్మతముల వారును శ్రీరామునే భజింతురని తేలుచున్నది. కాఁబట్టి ఆతఁడు 'సర్వోపాస్యః' అనుటకు సార్థకమైనవాఁడు.

ఆతఁడు స్వతంత్రుఁడు. పరతంత్రుఁడు. పరిమిత ఫలమునే యొసఁగఁ గలుగును. శ్రీరాముఁడు స్వతంత్రుఁడు, సర్వోపాస్యుఁడు, సర్వదేవతాక స్వరూపుఁడు, కేవలము పరబ్రహ్మ కావున సర్వస్వతంత్రుఁడు. ఈ విషయము శ్రీరామచంద్రుఁడు శ్రీమద్రామాయణములో గూఢముగ చెప్పియున్నాఁడు. జటాయువునకు మోక్షప్రదానము చేయునెడలను, కబంధునకు, శబరికి, విభీషణునకు అభయదానము మోక్షమిచ్చుపట్లను ఆతఁడు సర్వస్వతంత్రుఁడని మనము గ్రహింపఁగలము.

ఆతఁడు స్వతంత్రుఁడయ్యును నిత్యులగు నిజభక్తులకు భోగ్యుఁడగు చున్నాఁడు. అనఁగా నిత్య నిజభక్తులు ఆతని ననుభవించు చుందురు.

శ్రియఃపతిః అనఁగా సర్వాధిష్ఠాత్రియు, సర్వశక్తి సేవితయు నగు శ్రీదేవికి ఆతఁడు భర్త. ఏ మహాతల్లియొక్క క్రీగంటి చూపుచే బ్రహ్మేంద్రాది దేవతలకు లోకాధిపత్యములు, సమస్తైశ్వర్యములు లభించినవో అట్టి శ్రీదేవికి భర్త.

శ్లో॥ బ్రహ్మ విష్ణు మహేశానాం, కారణం సర్వవ్యాపకః,
మూలంత్వ హ్యవతారాణాం, ధర్మసంస్థాపకః పరః॥
ద్విభుజ శ్చాపభృచ్చైవ, భక్తాభీష్ట ప్రపూరకః,
వైదేహీ వల్లభోనిత్యం, కైశోరే వయసి స్థితః,
ఏవం భూతశ్చ జ్ఞాతవ్యో, రామో రాజీవలోచనః॥

తా॥ శ్రీరామచంద్రుఁడు బ్రహ్మవిష్ణు మహేశ్వరుల కును గారణమైనవాఁడు సర్వవ్యాపకుఁడు. సమస్తావతారములకును మూలము. ధర్మమును సంస్థాపించినవాఁడు. పరాత్పరుఁడు. రెండు చేతులు కలవాఁడు. చేతిలో విల్లునంబులను ధరించినవాఁడు. భక్తుల కోరికలను నెఱవేర్చువాఁడు. విదేహ రాజ తనయయగు సీతాదేవికి భర్త. నిత్యుఁడు. అనఁగా శాశ్వతుఁడు. ఎల్లప్పుడును కిశోరావస్థలోనే యుండువాఁడు. పద్మపత్రాక్షుఁడగు శ్రీరామచంద్రుని ఇట్టిలక్షణములు కల వాఁడని భావింపవలయును.

శ్రీరామచంద్రుఁడు బ్రహ్మ విష్ణు మహేశ్వరులకును గారణమని యిదివఱకే పూర్వశ్లోకమునఁ గొంతవఱకు చెప్పఁబడినది.

శ్లో॥ త్వం రజోగుణతో బ్రహ్మ జగత స్సర్వ కారణమ్,
సత్త్వా ద్విష్ణు స్త్వమేవాసి పాలక స్సద్భి రుచ్యతే॥
లయే రుద్ర స్త్వమేవాస్య, త్వన్మాయా గుణభేదతః
తాసాం విలక్షణస్సాక్షీ, రామ స్త్వం చిన్మయోఽవ్యయః॥
— అధ్యాత్మరామాయణము, అరణ్య అగస్త్యవచనమ్

నీవు రజోగుణముపై నాధిపత్యము వహించినపుడు బ్రహ్మవు, అప్పుడు నీవు జగత్సృష్టికి కారణమగుదువు. నీవు సత్త్వగుణముపై నాధిపత్యము వహించినపుడు విష్ణువందురు. అప్పుడు నీవు పాలన కార్యమును జేయుచుందువు. నీవు తమోగుణముపై నధికారము కలిగియున్నప్పుడు రుద్రుఁడందురు. అప్పుడు నీవు లయకార్యము నొనర్తువు. ఇవన్నియు నీమాయాగుణ భేదముచేతనే చేయుచుందువు. రామా! నీవు ఈ ముగ్గురకంటె విలక్షణుఁడవు. సాక్షిస్వరూపుడవు. చిన్మయుఁడవు. అద్వయుఁడవు.

శ్లో॥ త్వం విష్ణు ర్జానకీ లక్ష్మీ శ్శివ స్త్వం జానకీ శివా,
బ్రహ్మా త్వం జానకీ వాణీ, సూర్య స్త్వం జానకీ ప్రభా
రుద్రాణీ జానకీ ప్రోక్తా, రుద్ర స్త్వం లోకనాశకృత్॥
— అధ్యాత్మరామాయణము - అయో.

నారదుఁడు శ్రీరామునితో నిట్లనెను :—

శ్రీరామా! నీవు విష్ణువు. జానకీదేవి లక్ష్మి. శివుఁడవైనప్పుడు జానకి పార్వతియగును. నీవు బ్రహ్మవైనపుడు జానకి సరస్వతియగును. నీవు సూర్యుఁడవైనపుడు జానకి ప్రభాదేవి యగును. నీవు రుద్రుఁడవైనపుడు జానకి రుద్రాణి యగును.

ఇట్టివింకను జాలకలవు. గ్రంథ విస్తరభీతిని సంక్షిప్తము కావించుచున్నాము.

ఆంధ్రభక్తశిఖామణియగు త్యాగరాజస్వామివా రిట్లు గానము కావించిరి:—

"ఎవరని నిర్ణయించేదిరా – నిన్నెట్ల॥
శివుడనో మాధవుడనో పద్మ
భవుడనో పరబ్రహ్మమనో ॥నిన్నెట్ల॥

అనియు,

తులసీదాస గోస్వామియు నిట్లనిరి:—
"విధి హరి హర మయ వేద ప్రాణసో"

అనఁగా బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపుఁడును, వేదమునకు ప్రాణమును.

శ్లో॥ యస్మిన్ రమంతే మునయో, విద్యయా౽జ్ఞాన విప్లవే,
తం గురుం ప్రాహురామేతి, రమణాద్రామ ఇత్యపి॥
రామం విద్ధి పరంబ్రహ్మ, సచ్చిదానంద మద్వయమ్,
సర్వోపాధి వినిర్ముక్తం, సత్తామాత్ర మగోచరమ్॥
ఆనందం నిర్మలం శాంతం, నిర్వికారం నిరంజనమ్,
సర్వవ్యాపిన మాత్మానం, స్వప్రకాశ మకల్మషమ్॥
—అధ్యాత్మ రామాయణము.

అజ్ఞాన విప్లవము కలిగినపుడు జ్ఞానముచే నెవనిలో మునులు రమింతురో అట్టి యుత్కృష్టుని రాముఁడందురు. రమించుటచే రామ యనుపేరు వచ్చినది. శ్రీరామునే సచ్చిదానందునిఁగను, అద్వయునిఁగను బరబ్రహ్మగను దెలిసికొన

వలయును. ఆతఁడు సర్వోపాధి వినిర్ముక్తుఁడు. సమస్త జగత్తులు ఆయనకు శరీరమయ్యును దీనికి విలక్షణముగనే యున్నాఁడు. కేవలము సత్తామాత్రముగ నున్నాఁడు. ఆయన ఈచర్మ చక్షువులకు గోచరింపఁడు. కేవలము అనుభవజ్ఞానము చేతనే తెలియఁబడును. కేవలము అవ్యయానంద స్వరూపుఁడు. ప్రకృతిమలములు లేవు. శుద్ధుఁడు. క్షోభమంతయుఁ బ్రకృతిగుణమే. అట్టి క్షోభములు లేవు కావున నా రాముఁడు కేవలానంద శాంతిసముద్రుఁడు. వికారములు లేనివాఁడు. నిరంజనుఁడు. సర్వత్ర వ్యాపించినవాఁడు. ఆత్మ స్వరూపుఁడు. స్వయంప్రకాశుఁడు. కల్మషములు లేని వాఁడు.

బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు భేదము లేదు. కొందఱు భేదమెంచి బ్రహ్మను రజోగుణునిఁగను, విష్ణుని సత్త్వగుణునిఁగను, శివుని తమోగుణునిఁగను భావింతురు. వా రజ్ఞానులు. మానవులలో రజోగుణుఁడగు బ్రహ్మకంటెను, తమోగుణుఁడగు శివునికంటెను గొప్పవారు కలరు. అట్టియెడ వారు దేవత లెట్లగుదురు. నిజమునకు ముగ్గురును గుణాతీతులే. గుణములు ప్రకృతివి. ప్రకృతి కీవలనున్న మనకు వారియొక్క యథార్థ స్వరూపము తెలియక వారికిని ప్రకృతి గుణముల నంటఁగట్టు చున్నాము. నిజమగు భగవత్సాధన ప్రకృతి కావలనున్న యథార్థ స్వరూపమును జూడఁగలిగినపుడే సిద్ధింపఁ గలదు.

ఒక ముక్కోణపు లాంతరునకు మూఁడువైపులను మూఁడురంగుల అద్దములు కలవు. ఒకటి ఎఱ్ఱని అద్దము.

రెండవది తెల్లని అద్దము. మూఁడవది నల్లని అద్దము. ఇవియే రజస్సత్త్వ తమోగుణములు. లోన నిర్మలజ్యోతి కలదు. ఆ అద్దముల కీవలనున్న వారికి జ్యోతి యెఱ్ఱగను, తెల్లగను, నల్లగను గనఁబడును. కాని యథార్థమున కట్లులేదు. లోనకుఁ బోయిచూచిన జ్యోతి, తత్కిరణములు శుద్ధముగ నుండును. జ్యోతియే పరబ్రహ్మ. పరమాత్మ. దానినే మనమిప్పుడు రాముఁడనుచున్నాము. జ్యోతిలోనుండి వెలువడిన కిరణములు సర్వదిశలను గలవు. ఎఱ్ఱని అద్దముపైఁబడిన కిరణముల భాగమునకు బ్రహ్మయని పేరు. తెల్లని అద్దముపైఁబడిన కిరణముల భాగమునకు విష్ణువని పేరు. నల్లని అద్దముపైఁబడిన కిరణముల భాగమునకు శివుఁడనిపేరు. ప్రకృతిలో మునిఁగిన వారికి జ్యోతి భేదముగ గోచరించుచున్నది. కాని ప్రకృతిని దాఁటి పరమాత్మ వస్తువును జూచువారికి బ్రహ్మ విష్ణు మహేశ్వరుల భేదము గోచరింపదు.

శ్రీమద్భాగవతములో నిట్లు చెప్పఁబడినది.

శ్లో॥ త్రయాణా మేక భావానాం, యో న పశ్యతి వై భిదామ్,
సర్వభూతాత్మనాం బ్రహ్మన్, స శాంతి మధిగచ్ఛతి॥

—భాగ-౪-౭-౫౪

ఓ బ్రాహ్మణోత్తమా! మేము ముగ్గురము నేకరూపులమే. మేము సర్వభూతములకు ఆత్మస్వరూపులము. మా ముగ్గురిలో భేద మెంచని వాఁడెవఁడో వాఁడు మోక్షమును బొందును.

శ్లో॥ ఏకమూర్తి స్త్రయో దేవా, బ్రహ్మ విష్ణు మహేశ్వరాః॥
— పద్మపురాణము.

ఒకేమూర్తి బ్రహ్మ విష్ణు మహేశ్వరులను పేరుతో ముగ్గురుగ నైరి.

శ్లో॥ ఏకైవ మూర్తి ర్విభిదే త్రిధా సా
సామాన్య మేషాం ప్రథమావరత్వమ్॥
— కుమారసంభవము.

ఒకే భగవంతుఁడు మూఁడురూపులయ్యెను. వారిలో తక్కువ ఎక్కువలు సామాన్యమే. అనఁగా అందఱును ఒకరికంటె నొకరు తక్కువవారు, అందఱు ఒకరికంటె నొకరు గొప్పవారు.

శ్లో॥ అహం బ్రహ్మచ శర్వశ్చ, జగతః కారణం పరమ్॥
— భాగవతము.

అత్రి విశ్వకారణమగు భగవంతుని గూర్చి తపస్సు చేయఁగా విష్ణువు ప్రత్యక్షమై యిట్లనెను:-

నేను (విష్ణువును), బ్రహ, శివుఁడు మేము ముగ్గురము జగత్తునకుఁ గారణముగ నున్నాము.

శ్లో॥ స్రష్టా సృజతి చాత్మానం, విష్ణుః పాల్యం చ పాతిచ,
ఉప సంహ్రియతే చాపి, సంహర్తా చ స్వయం ప్రభుః॥
—పద్మపురాణము–సృష్టిఖండము ౨–౧౧౫.

బ్రహ్మ సృష్టి, సృష్టికర్తయు, విష్ణువు పాల్యము, పాలకుఁడును, శివుఁడు సంహరణీయము, సంహార్త. ఇవన్నియు నొక్క ప్రభువే:

పై యాధారముల ననుసరించి భగవంతుఁ డొక్కఁడే. ఆతఁడు త్రిమూర్తుల కతీతుఁడు. ఆతఁడే త్రిమూర్తి స్వరూ కార్యము కొఱకైనాఁడు. ఇచ్చట మన రాముఁడు త్రిమూర్తుల కతీతుఁడు. కారణుఁడును.

శ్లో॥ ఏకమూర్తి స్త్రయోదేవా, బ్రహ్మ విష్ణు మహేశ్వరాః,
త్రయాణా మంతరం నాస్తి, గుణ భేదాః ప్రకీర్తితాః॥
—పద్మపురాణము భూమిఖండము ౭౧-౭౦.

ఒక్కఁడే బ్రహ్మ విష్ణు మహేశ్వరులుగ నైనారు. ఈ ముగ్గురకును భేదములేదు. గుణభేదముచే నిట్లు చెప్పఁబడుచున్నారు.

సర్వవ్యాపకః=శ్రీరాముఁడుసర్వవ్యాపకుఁడు. ఆయన నొక్కచోట లీలాధామము నందుండియు సర్వత్ర నిండియున్నాఁడు. విద్యుత్తు కార్యావసరమును బట్టి దీపముగానో, పంకాగానో, మఱగానో, ట్రాంబండిగానో, గంటగానో ఇట్లనేకవిధముల వివిధరూపములతో వ్యక్తమై యుపయోగపడుచున్నది. కాని యావిద్యుత్తే నిర్గుణరూపమున సర్వత్ర వ్యాపించియున్నది. కోరిక యున్నప్పుడు సగుణము. కోరికలు లేకున్నప్పుడు నిర్గుణము. భగవంతుఁడు సగుణ నిర్గుణములుగ నుండఁగలఁడు. కొందఱు మూఢులు భగవంతుఁడు సగుణుఁడే

కాని నిర్గుణుఁడు కాఁడని వాదింతురు. నిర్గుణుఁడు కాలేని ఆసర్వశక్తిమంతుఁడు మనకెందులకు? కొందఱు భగవంతుఁడు నిర్గుణుండేకాని సగుణుఁడు కాఁడని వాదింతురు. సగుణుఁడు కాలేని నిర్గుణుఁడును, ఆ సగుణములోనుండని నిర్గుణుఁడు మనకేల? కొందఱు అన్యదేవతలను దూషించి ద్వేషింతురు. వారి యిష్టదైవము వారు దూషించి ద్వేషించు దేవతలలో లేరనియే వారి భావము. అట్లుగాక మన శ్రీరామచంద్రమూర్తి సర్వత్ర వ్యాపించియున్నాఁడు. "అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్య నారాయణస్థితః" శ్రీమన్నారాయణుఁడు లోపల వెలుపల సర్వత్ర వ్యాపించియున్నాఁడు.

మూలంతు హ్యవతారాణాం = సమస్తావతారములకు మూలము శ్రీరామచంద్రుఁడే. అనఁగా నీయన నుండియే సమస్త అవతారములు పుట్టినవి.

శ్లో॥ మత్స్యశ్చ రామహృదయం, యోగరూపీ జనార్దనః,
కూర్మశ్చాధారశక్తిశ్చ, వారాహో భుజయోర్బలమ్॥
నారసింహో మహాకోపో, వామనః, కటిమేఖలా,
భార్గవో జంఘయోర్జాతో, బలరామశ్చ పృష్ఠతః॥
బౌద్ధశ్చ కరుణా సాక్షాత్, కల్కిశ్చిత్తస్య హర్షతః,
కృష్ణః శృంగార రూపశ్చ, బృందావన విభూషణః॥
ఏతే చాంశకలాః సర్వే, రామస్తు భగవాన్ స్వయమ్॥

— సామవేదీయ సుదర్శన సంహితా.

రాముని హృదయముగ యోగరూపియగు జనార్ద నుఁడు మత్స్యావతారమై యుండెను. కూర్మావతారము ఆధారశక్తి, వరాహావతారము శ్రీరాముని భుజబలము. నరసింహావతారము శ్రీరాముని కోపము, వామనావతారము నడుమునుండియు, పరశురామావతారము శ్రీరాముని రెండు పిక్కలనుండియు, వీఁపునుండి బలరాముఁడును, ఆ శ్రీరాముని కరుణనుండి సాక్షాత్తుగ బౌద్ధావతారమును, చిత్తహర్ష రూపమున కల్కిరూపమును, బృందావన విభూషణుఁడగు శ్రీకృష్ణుడు శ్రీరాముని శృంగారము వలననైరి. వీరందఱును అంశావతారములు, కళావతారములు. శ్రీరాముఁడు స్వయముగ భగవంతుఁడు.

శ్లో॥ అయోధ్యాపతి రేవ స్యా, త్పతీనాం పతి రీశ్వరః,
అన్యేషాం మధురాదీనాం, రామాంశాః పతయో యతః॥
అవతారాస్తు బహవః, కలా అంశా విభూతయః,
రామో ధనుర్ధరః సాక్షా, త్సర్వేశో భగవాన్ స్వయమ్॥
భోగస్థాన పరాఽయోధ్యా, లీలాస్థానం త్విదం భువి,
భోగలీలా పతీరామో, నిరంకుశ విభూతికః॥
భోగస్థానాని యావంతీ, లీలాస్థానాని యానిచ,
తాని సర్వాణి తస్యైవ, పురో వ్యాప్యాని సర్వశః॥
స బాహ్యాభ్యంతరం కృత్స్నం, ఆనంద రసస్యందితః,
మధూదధి రివాపారో, రామ ఏవ పరః పుమాన్॥
— శివసంహిత-పంచమపటము-౨ అధ్యా.

శివుఁడు పార్వతితో నిట్లనెను :-

అయోధ్యాధిపతి శ్రీరామచంద్రుఁడే. పతులందఱకు పతి యీతనయే. మధురాధిపతియగు శ్రీకృష్ణుఁడు మొదలగు వారందఱును శ్రీరాముని అంశములే. కళావతారము లనియు, అంశావతారము లనియు, విభూతులనియు అవతారము లనేకములు కలవు. వీరిలో ధనుర్ధారియగు శ్రీరామచంద్రుఁడే సాక్షాత్తుగ సర్వేశ్వరుఁడు. భగవంతుఁడు. పరాస్థానములో ప్రకృతి కావలనున్న యయోధ్య భోగస్థానము. భూమండలమున నున్న అయోధ్య లీలాస్థానము. అనేకములగు భోగస్థానములును, అనేకములగు లీలాస్థానములును దానిని జుట్టుకొనియే యున్నవి. ఈ భోగలీలాస్థానములకు పతి శ్రీరాముఁడు. ఇచ్చటి యైశ్వర్యము నిరంకుశమైనది. అయోధ్య యంతయును లోపలను వెలుపలను ఆనంద రసముతో నిండియున్నది. ఇది మధుసముద్రమును బోలి అపారముగ నున్నది. దీనికంతకును అధిపతి శ్రీరామచంద్రుఁడే.

ధర్మ సంస్థాపకః = ధర్మమును లెస్సగా స్థాపించినవాఁడు. అసలు శ్రీరాముఁడు ధర్మావతారము. తల్లిదండ్రుల యెడలను, అన్నదమ్ముల యెడలను, గురువుల కడను, స్నేహితుల కడను, శత్రువులవద్ద నెట్లు మెలఁగవలయునో, భార్యతో నెట్లుండవలయునో, ఎచ్చటెచ్చట నేయే విధముగ నడుచుకొనవలయునో శాస్త్రధర్మము తప్పకుండ ఆచరించి చూపించిన యవతారము శ్రీరామావతారము.

పరః = పరుఁడు. అనఁగా మూలప్రకృతిని దాఁటి పరమున త్రిపాద్విభూతి రూపమున నున్నవాఁడు. "పాదోఽస్య విశ్వాభూతాని, త్రిపాదస్యామృతం దివి" అని శ్రుతి. భగవంతునిలో నొకభాగము సమస్త భూతములయొక్క సృష్టి. మిగిలిన మూఁడు భాగములు సృష్టిలేని అమృత స్వరూపము. ఇదియే త్రిపాద్విభూతి.

ద్విభుజః = రెండు చేతులు కలవాఁడు. భగవంతుఁడాయా యవతారములలో భిన్నభిన్న రూపములుగ నున్నాఁడు. శ్రీమహావిష్ణువు అష్టభుజములు కలవాఁడుగను, నారాయణుఁడు నాలుగు భుజములు కలవాఁడుగను, శ్రీరామచంద్రుఁడు నాల్గు భుజములు కలవాఁడుగ నున్నాఁడు. లీలాస్థానమున మానుష లీల జరుపవలసి యుండుటచే ద్విభుజములు కలిగియున్నాఁడు. ఆతఁడు శ్రీమన్నారాయణుఁడుగఁ జతుర్భుజములు కలవాఁడుగ అహల్యకును, ప్రథమ సమావేశ సమయమున నాంజనేయునకును గనఁబడెను.

శ్లో॥ ద్విభుజా ద్రాఘవో నిత్యం, సర్వమేత త్ప్రవర్తతే,
పరా న్నారాయణాచ్చైవ, కృష్ణా త్పరతరా దపి॥
ఉభయ పరాత్మనః శ్రీమాన్, రామో దాశరథిః స్వరాట్॥
— నారద పంచరాత్రము ఆనందసంహిత.

ద్విభుజములచే రాఘవుఁడు నిత్యుఁడు. ఈతఁడే అందఱికంటెను శ్రేష్ఠుడు. నారాయణుఁడును శ్రీకృష్ణుఁడును బరులే. ఈ యిద్దఱికిని బరమాత్మ దాశరథియగు శ్రీరామచంద్రుఁడే.

చాపభృత్ =విల్లును ధరించువాఁడు. 'చాపభృచ్చైవ' అనుదానిలోని చకారముచే బాణములను గూడ ధరించినాఁడను నర్థము కలదు.

ఏ దేవునికైనను ఆయుధ ముండును. శ్రీరామచంద్రునకు విల్లు, అంబులును, శ్రీమన్నారాయణునకు శంఖ చక్రములును, పరమశివునకు త్రిశూల డమరుకములును ఇట్లే యితర దేవతలకును వేఱు వేఱాయుధములు కలవు. ఆయుధములు ధరించుట భక్తులను రక్షించుటకు. శ్రీమన్నారాయణునకుఁ గల చక్రము కాలచక్రమును దెలుపును. అనఁగాఁ గాల మనంతమనుటను చక్రము సూచించును. చక్రమునకు మొదలు చివర లేదుకదా! శంఖము శబ్ద బ్రహ్మము (ఓంకారము)ను సూచించును. శివుని చేతిలోఁ द्रिశూలము కలదు. త్రిశూలమునకు మూఁడు రేఖలుండును. ఇవి సమానాంతరములు. సమానాంతరములకు అంతమెట్లు లేదో అట్లే ఈ భూత భవిష్యద్వర్తమాన కాలములకు అంతము లేదు. మన శ్రీరామచంద్రుని చేతిలోని విల్లు ప్రణవమును సూచించును. అంబు కాలమును సూచించును.

భక్తాభీష్ట ప్రదాయకః = భక్తులయొక్క కోరికలను నెఱవేర్చువాఁడు. భక్తులనియు, భాగవతులనియు భక్తులు రెండు విధములు. భక్తులు భగవంతునిఁ బ్రేమించువారు, భగవంతుఁడు ప్రేమింపకున్నను బ్రేమించువారు. అనఁగా వీరు మర్కట కిశోర న్యాయమును దెలుపును. కోఁతిపిల్ల కోఁతిని గట్టిగాఁ బట్టుకొనును. కోఁతి పట్టుకొనదు. ఒకవేళ వ్యదిలివేసి

నుండి ఇంకొక కొమ్మమీఁదకు దుముకు చున్నప్పటికిని పిల్ల తల్లిపొట్టకుఁ గఱచుకొని వదలదు. భక్తులిట్టివారే. భగవంతునే భక్తులు ఆతఁడెన్ని చిక్కులు పరీక్షకై పెట్టినను వదలరు. వీరు కోరికలు కోరవచ్చును.

ఇఁక భాగవతులును భగవంతుని భజించువారే. కాని వీరు తమ్ము రక్షణ చేయుమనియైనను కోరరు. వీరు పిల్లిపిల్ల వంటివారు. మార్జాల కిశోరన్యాయము. ఇచ్చట తల్లిపట్టుయే కాని పిల్లపట్టు లేదు. పిల్లి తనకూనను పదును కలిగిన తన కోరపండ్లతో నేఁడుచోట్ల త్రిప్పును. కూన కిసుమంతైనను గాసి కలుగదు. అట్లే భాగవతులను తా మడుగకున్నను భగవంతుఁడు కనుఱెప్పరీతిగ రక్షించు చుండును.

భక్తుల కోరికల నిచ్చుచుండు ననుటలోఁ బైనఁజెప్పిన రెండురకముల భక్తులలో (భక్తభాగవతులలో) ఇద్దరి కోరికలను దీర్చునని తాత్పర్యము. భక్తులకు కోరుట వలనను, భాగవతులకుఁ గోరకుండకయే కోరికలను బ్రసాదించు చుండు నని తాత్పర్యము.

వైదేహీ వల్లభః = సీతాదేవికి భర్త. సూర్యునికి సూర్యకాంతి యెట్లు వదలియుండలేదో అట్లే సీతాదేవికిని తనకును భేదములేదు. ఇద్దరును వదలి యుండరు. ఆమెప్రకృతి. శ్రీరాముఁడు పురుషుఁడు. ఈతఁడు ప్రకృతికి భర్త. అనఁగా నీతనికి మాయాప్రకృతులు వశమైయుండును. ఈమె అనపాయిని. ఆతఁ డేయవతారమును ధరించునో ఈమెయును దగినట్టి రూపవయోగుణముల ననుసరించి యవతరించును.

శ్లో॥ తన్మధ్యే జానకీ దేవీ, సర్వశక్తి నమస్కృతా,
తత్రాస్తే భగవాన్ రామః, సర్వదేవ శిరోమణిః॥

ఆ సింహాసన మధ్యప్రదేశమున సర్వశక్తులచే నమస్కరింపఁబడు జానకీదేవి కలదు. అక్కడనే సర్వదేవతలలో శిరోమణివంటి వాఁడగు శ్రీరామచంద్ర భగవానుఁ డున్నాఁడు.

జానకీదేవి పరాదేవత. ఈమెకు అంశభూతలుగ ముప్పది ముగ్గురు శక్తులు కలరు. వారందఱు నీమె సన్నిధానమున నివసించుచుందురు.

శ్లో॥ సంప్రవక్ష్యామి యాశ్శక్తీః, జ్ఞానక్యంశా స్త్రిత్రింశకాః,
నికటే సంస్థితా నిత్యం, సర్వాభరణ భూషితాః॥
శ్రీ ర్భూ ర్లీలా తథోత్కృష్టా, క్రియా యోగోన్నతీ తథా,
జ్ఞానా పార్వీ తథా సత్యా, కథితా చాప్యనుగ్రహా॥
ఈశానా చైవ కీర్తిశ్చ, విద్యేలా క్రాంతి లంబనీ,
చంద్రికాపి తథా క్రూరా, కాంతా వై భీషణీ తథా॥
క్షాంతా చ నందనీ శోకా, శాంతా చ విమలా తథా,
శుభగా శోభనా పుణ్యా, కలా చాప్యథ మాలినీ॥
మహాహ్లాదయా హ్లాదినీ శక్తయ ఏకాదశ త్రికాః।
భృకుటిం దర్శయంతీమా, జానక్యా నిత్యమేవచ॥
— మహారామాయణము.

శివుఁడు పార్వతితో నిట్లనెను:—

శ్రీ జానకీదేవి యంశమున ముప్పది ముగ్గురు శక్తులు కలరు. ౧. శ్రీ. ౨. భూదేవి. ౩. లీలాదేవి. ౪. ఉత్కృష్టా.

౫. క్రియా: ౬. యోగా. ౭. ఉన్నతి. ౮. జ్ఞా[illegible]
౧౦. సత్యా. ౧౧. అనుగ్రహా. ౧౨. ఈశానా. ౧౩. [illegible]
౧౪. విద్యా. ౧౫. ఇలా. ౧౬. క్రాంతి. ౧౭. లంబనీ.
౧౮. చంద్రికా. ౧౯. క్రూరా. ౨౦. కాంతా. ౨౧. భీషణీ.
౨౨. తాంతా. ౨౩. నందనీ. ౨౪. శోకా. ౨౫. శాంతా
౨౬. విమలా. ౨౭. శుభదా. ౨౮. శోభనా. ౨౯. పుణ్యా
౩౦. కలా. ౩౧. మాలినీ. ౩౨. మహ్లాదయా ౩౩. ఆహ్లా
దినీ. ఈ ముప్పది ముగ్గురు శక్తులు జానకీదేవి భ్రుకుటిని
జూచుచుందురు.

శ్లో॥ శ్రీ శ్చ శ్రీః ప్రేరకా జ్ఞేయా, భూ రండాధార ఉచ్యతే,
లీలా బహువిధా లీలా, ఉత్కృష్టో త్కర్ష ప్రేరకా॥
క్రియా సమక్రియా సమ్య గ్యోగా యోగాన్వితా గతిః॥
ఉన్నతీ మహతీ వృద్ధి ర్జ్ఞానా విజ్ఞాన ప్రేరకా,
కరోతి ప్రేరణం సమ్యక్, పర్వే జయపరాజయా॥
సత్యస్య ప్రేరకా సత్యాఽనుగ్రహార్థా దయా గుణాః,
యే చ సర్వే జగన్మధ్యే, భేదా అపి సుదుస్తరాః॥
ఈశానా ప్రేరకా తేషాం, వర్తతే నాత్ర సంశయః
యశోఽధికారిణీ కీర్తి ర్విద్యా విద్యాధికారిణీ॥
సద్వాణీ ప్రేరకేలా స్యా, త్క్రాంతా క్రాంతి వివర్ధినీ,
యాని ధామాని సర్వాణి, శ్రీరామస్యా ద్భుతానిచ॥
గుణాశ్చా నంత రూపాణి, ప్రేరకైషాం విలంబినీ,
సీతప్రకాశయో సమ్యక్, ప్రేరకా చంద్రికాపి చ॥

క్రూరత్వం ప్రేరకా క్రూరా, మనో వాక్కాయ కర్మభిః,
ప్రేరకా వర్తతే కాంతా, రాగమోహకా శుభాశుభా॥
ప్రేరకా భీషణీ తేషాం, యే చ సర్వే భయాదయః,
వర్తతే ప్రేరకా క్షాంతా. క్షమా గుణ విశేషతః॥
నందనీ చ తథా శక్తిః, సర్వానంద ప్రకాశినీ॥
శోకా స్వయం విశోకాచ, లోకానాం శోకప్రేరకా,
శాంతి ప్రదాయినీ శాంతా, విమలా విమలాన్ గుణాన్॥
శుభదా సర్గాణాం శోభాం, ప్రేరయంతీ చ శోభనా,
పుణ్యాపుణ్య గుణోపేతా, కలా బహుకలావతీ॥
మాలినీ వ్యాపకాన్ సర్వాన్, ప్రేరయంతీ మహాహ్లాదయాన్,
విభవం ప్రకృతిర్భక్తి, గ్భక్తిం వర్ధయతే సదా॥
ఆహ్లాదినీ మహాహ్లాదం, సంవర్ధయతి సర్వదా,
స్వే స్వే కార్యే రతా స్సర్వా, శ్శక్తయ శ్చైవ తా స్సదా॥
యస్మిన్ కాలే భవే దాజ్ఞా, సీతా రామాను శాసనమ్,
తస్మిన్ కాలే ప్రకుర్వీత సర్వం కార్య మశేషతః॥
ఏకైకానాం, సహస్రాణి, వర్తంతే చోపశక్తయః,
వ్యాపకాన్ సర్వలోకేషు, సర్వతో గగనం యథా॥
జానక్యాంశాది సంభూతాః, నేక బ్రహ్మాండ కారిణీ,
సా మూలప్రకృతిః జ్ఞేయా, మహామాయా స్వరూపిణీ॥
— మహారామాయణము

౧. సమస్త బ్రహ్మాండమున లక్ష్మిని ప్రేరేపించునది యనెడు శక్తి. ౨. బ్రహ్మాండమున కాధారము భూదేవి.

౩. సమస్త లీలలను ప్రేరేపించునది లీలా-. జ్ఞానా. ...
ప్రేరేపించునది ఉత్కృష్టాదేవి. ౫. సమస్తఋశ్వా నా. ౧౩
పించునది క్రియాశక్తి. ౬. అష్టాంగాది యో... ౭. లంబోరే
పించునది యోగశక్తి. ౭. సకల వృద్ధులను ప్రేరేపించునది
ఉన్నతిశక్తి. ౮. జ్ఞానవిజ్ఞాన వైరాగ్యములను ప్రేరేపించునది
జ్ఞానశక్తి. ౯ జయాపజయములను ప్రేరేపించునది పర్వీశక్తి.
౧౦. సత్యమును ప్రేరించునది సత్యాశక్తి. ౧౧. దయాదికము
లను ప్రేరించునది అనుగ్రహాశక్తి. ౧౨. సమస్త దుస్తర భేద
ములను ప్రేరించునది ఈశానశక్తి. ౧౩. యశమును ప్రేరించు
నది కీర్తిశక్తి. ౧౪. విద్యలను ప్రేరించునది విద్యాశక్తి.
౧౫. సద్వాణిని ప్రేరించునది ఇలాశక్తి. ౧౬. కాంతుల నన్ని
టిని ప్రేరించునది క్రాంతాశక్తి. ౧౭. ముల్లోకములు, చతుర్దశ
భువనములు, ౧౦౮ వైకుంఠములు కలవు. ఇవన్నియు శ్రీరా
ముని నామములే. భగవంతుని అనంతగుణములు, అనంత
రూపములు, అంశ, కళా, విభూతి ఆవేశా ద్యవతారములు.
వీటిని ధరించునది విలంబినీశక్తి. ౧౮. శీతప్రకాశ ప్రేరకమైనది
చంద్రికాశక్తి. ౧౯. సమస్త క్రూరత్వములను ప్రేరేపించునది
క్రూరశక్తి. ౨౦ రాగ, మోహ, శుభాశుభములను ప్రేరే
పించునది కాంతాశక్తి. ౨౧. భయములను ప్రేరించునది
భీషణశక్తి. ౨౨. క్షమాగుణమును ప్రేరించునది క్షమాశక్తి
౨౩. ఆనందమును ప్రేరించునది నందినీశక్తి. ౨౪. శోకాశక్తి
లోకమున కంతకును శోకమును గలిగించును. ౨౫. శాంతిని
ప్రేరించునది శాంతశక్తి. ౨౬. విమల గుణమును ప్రేరించు

నది విమలాశక్తి. ౨౭. సద్గుణమును ప్రేరించునది శుభదాశక్తి. ౨౮. సుందరత్వమును ప్రేరించునది శోభనాశక్తి. ౨౯. పుణ్యమును ప్రేరించునది పుణ్యాశక్తి. ౩౦. సకల గుణములను చతుష్షష్టికళలను ప్రేరించునది కళావతీశక్తి. ౩౧. సర్వత్ర వ్యాపించునది మాలినీశక్తి. ౩౨. సమస్త విభవ ప్రకృతి గుణములను భక్తిని ప్రేరించునది భక్తిశక్తి. ౩౩. పరమాహ్లాదమును అనఁగా బ్రహ్మానందమును ప్రేరేపించునది హ్లాదినీశక్తి. ఈ శక్తులన్నియును వాటివాటి కార్యములను జేయుచుండును. సీతారాముల యాజ్ఞయైనప్పుడు సర్వశక్తులును సర్వకార్యములను విశేషముగఁ జేయుచుండును. ఈ శక్తులన్నిటిని వేల కొలఁది మంది ఆజ్ఞలను బరిపాలించు దాసీలు కలరు. వారు సమస్త లోకముల వ్యాపించియున్నారు. ఆకాశమువలె జానకీయంశచే నుత్పన్నమైన మూలప్రకృతి. మహామాయాస్వరూపిణి. ఈమె అనేక బ్రహ్మాండములను రచింపఁగలదు.

ఇట్లు సమస్త శక్తులకును ఆదిభూతమగు జానకీదేవికి నతఁడు భర్త. కాఁబట్టి సమస్త దేవతలకంటె సీతఁడే శ్రేష్ఠుఁడు. ఆదికారణుఁడు.

నిత్యం కైశోరే వయసి స్థితః = ఎల్లప్పుడును కిశోరావస్థలోనే యుండువాఁడు. అనఁగా మానవులకువలె నాతనికి జరామరణములు లేవు. బాల్య, యౌవన, కౌమార వృద్ధాప్యములు లేవు. అతఁ డవతారములలో బాల్యాద్యవస్థలను జూపించుట మన సంతోషము కొఱకే.

శ్లో॥ భానుకోటి ప్రతీకాశం, చంద్రకోటి ప్రమోదకమ్,
ఇంద్రకోటి సదామోదం, వసుకోటి వసుప్రదమ్॥
విష్ణుకోటి ప్రతిపాలం, బ్రహ్మకోటి విసర్జనమ్,
రుద్రకోటి ప్రమర్దంవై, మాతృకోటి వినాశనమ్॥
భైరవకోటి సంహారం, మృత్యుకోటి విభీషణమ్,
యమకోటి దురాధర్షం, కాలకోటి ప్రధానకమ్॥
గంధర్వకోటి సంగీతం, గణకోటి గణేశ్వరం,
కామకోటి కలానాథం, దుర్గాకోటి విమోహనమ్॥
సర్వసౌభాగ్య నిలయం, సర్వానందైక దాయకమ్,
కౌసల్యానందనం రామం, కేవలం భవఖండనమ్॥

— సదాశివసంహిత.

శేషుఁడు వేదములతో నిట్లుచెప్పెను:—

శ్రీరామచంద్రుఁడు కోటిసూర్య ప్రభాభాసమానుఁడు, కోటిచంద్రులవలె నానందము (శాంతి) ను బ్రసాదించువాఁడు, కోటి ఇంద్రులవలె నిరంతరము ఆనందము చెందువాఁడు, కోటి వసువులవలె ద్రవ్యము నిచ్చువాఁడు, కోటి విష్ణువులవలెఁ బాలనకర్త, కోటి బ్రహ్మలవలె సృష్టికర్త, కోటిరుద్రులవలె సంహారకర్త, కోటి మాతృదేవతలవలె నాశకర్త, కోటి భైరవులవలె సంహారకర్త, కోటి మృత్యువులవలె భయంకరముగు వాఁడు, కోటియములవలె మహాకఠినుఁడు, కోటికాలముల వలెఁ బరువిడువాఁడు, కోటిగంధర్వులవలె సంగీతమును బాడఁగలవాఁడు, కోటి గణములవలె గణేశ్వరుఁడు, కోటి

మన్మథులవలెఁ గళానాథుఁడు, కోటిసూర్యులవలె విమోహింపఁ జేయువాఁడు, సర్వ సౌభాగ్యములకు నిలయమైనవాఁడును, సర్వానందముల నొసఁగువాఁడును, కేవలము సంసారమును ఖండించువాఁడు. ఇట్టివాఁడు కౌసల్యకుఁ గుమారుఁడు.

శ్లో॥ ఆసీనం తమయోధ్యాయాం, సహస్ర స్తంభ మండితే,
మండపే రత్నసంక్లేచ, జానక్యాసహ రాఘవమ్॥
మత్స్యః కూర్మ కిర్యనేకో, నారసింహోఽ ప్యనేకధా,
వైకుంఠోఽపి హయగ్రీవో హరిః కేశవ వామనో॥
యజ్ఞో నారాయణో ధర్మ, పుత్రో నరవరోఽ పిచ,
దేవకీ నందనః కృష్ణో, వాసుదేవో బలోఽపిచ॥
పృశ్నిగర్భో మధూనాస్థి, గోవిందో మాధవోఽపిచ,
వాసుదేవో పరోఽనంతః, సంకర్షణ ఇరావతిః॥
ప్రద్యుమ్నోఽ ప్యనిరుద్ధశ్చ, వ్యూహాః స్సర్వేఽపిసర్వదా,
రామం సదోపతిష్ఠంతే, రామా దేశేవ్యవస్థితాః॥
ఏతైరన్యైశ్చ సంసేవ్యో, రామోహ్యేష మహేశ్వరః,
తేవా మైశ్వర్య దాతృత్వా, త్తస్మాలత్వా న్నిరీశ్వరః॥
— శివసంహిత – ౫ పటలము – ౨ అధ్యా.

శివుఁడు పార్వతితో నిట్లనెను :—

సహస్ర స్తంభ మండితమగు రత్న మండపమున అయోధ్యయందు జానకీదేవితోఁగూడి శ్రీరామచంద్రమూర్తి కూర్చుండియుండెను. ఎదుట మత్స్య, కూర్మ, వారాహ, నర

సింహ, ఇంక ననేకులగు వైకుంఠ భగవానులును, హయ గ్రీవుఁడు, హరి, కేశవుఁడు, వామనుఁడు, యజ్ఞ, నారాయణులు, ధర్మపుత్రులగు నరవరులును, దేవకీనందనుఁడగు కృష్ణుఁడు, వాసుదేవుఁడు, బలరాముఁడు, పృశ్నిగర్భుఁడు, మధుసూదనుఁడు, గోవిందుఁడు, మాధవుఁడు, వాసుదేవుఁడు, పరుఁడు, అనంతుఁడు, సంకర్షణుఁడు, లక్ష్మీపతి, ప్రద్యుమ్నుఁడు, అనిరుద్ధుఁడును, చతుర్వ్యూహమూర్తులును, శ్రీరాముని సన్నిధిని నిలిచియుందురు. వారందఱును శ్రీరామాజ్ఞ ననుసరించి వర్తించుచుందురు. ఇఁక మిగిలినవారందఱును శ్రీరాముఁడను నామము గలవానిని సేవించుచుందురు. వీరందఱును రామనామమును జపించుచుందురు. అందఱకు నైశ్వర్య మొసంగుటచే శ్రీరాముఁడే పరబ్రహ్మ. అతఁడే మూలపురుషుఁడు. అతనికి ప్రభువెవఁడును లేఁడు. అందఱకు ఈశ్వరుఁడు శ్రీరాముఁడే.

శ్లో॥ ఇంద్రనామా సఇంద్రాణాం, పతిస్సాక్షీ గతిః ప్రభుః
విష్ణు స్స్వయం స విష్ణూనాం, పతిర్వేదాంత కృ ద్విభుః॥
బ్రహ్మ సబ్రహ్మణాం కర్తా ప్రజాపతి పతిర్గతిః
రుద్రాణాం సపతీ రుద్రో, రుద్రకోటి నియామకః॥

చంద్రాదిత్య సహస్రాణి, రుద్రకోటి శతానిచ,
అవతార సహస్రాణి శక్తికోటి శతానిచ॥
ఇంద్రకోటి సహస్రాణి విష్ణుకోటి శతానిచ,
బ్రహ్మకోటి సహస్రాణి, దుర్గాకోటి శతానిచ॥

మహాభైరవ కల్యాణీ కోట్యర్బుద శతానిచ,
గంధర్వాణాం సహస్రాణి, దేవకోటి శతానిచ।
వేదాః పురాణశాస్త్రాణి, తీర్థకోటి శతానిచ,
దేవబ్రహ్మమహర్షీణాం, కోటికోటి శతానిచ॥
నిర్మత్సరైశ్చ విద్వద్భి ర్మంత్రార్థ ప్రయత్నైరపి,
ప్రోచ్యంతే యాని తాన్యేవ, రామాంశా ద్బ్రహ్మవాదిభిః
యం వేదాంత విదో, బ్రహ్మ వదంతి బ్రహ్మవాదిభిః
పరమాత్మేతి యోగీంద్రా, భక్తాస్తు, భగవానితి॥
సభాం యస్య నిషేవంతే, స శ్రీరామ ఇతీరితః॥

—శివసంహిత ౫ పటలము ౨ అధ్యా

ఆ శ్రీరాముఁడే ఇంద్రుఁడను పేర సమస్త ఇంద్రులకును బ్రభువు. సాక్షి, గతి, ప్రభువు. విష్ణువు లందఱకు నాతఁడు విష్ణువు. పతియును, సమస్త వేదాంత శాస్త్రములకును కర్త ఆయనయే. ఆ రాముఁడే బ్రహ్మ. బ్రహ్మ లందఱకు నాతఁడు కర్త. ప్రజాపతులకుఁ బతి, గతి, ఆ శ్రీరాముఁడు రుద్రుఁడయ్యు రుద్రులందఱకును బతి. కోటి రుద్రులను నియమించు వాఁడగుచున్నాడు. వేయి చంద్రులకును, వేయిసూర్యులకును నూఱుకోట్ల శివులకును శ్రీరాముఁడు సమానుఁడు. వేయి కోట్ల అవతారములకును, నూఱుకోట్ల శక్తులకును సమానము వేయికోట్ల ఇంద్రులకును, నూఱుకోట్ల విష్ణువులకును, వేయి కోట్ల బ్రహ్మలకును, నూఱుకోట్ల దుర్గలకును, నూఱుకోట్ల అర్బుదముల మహాభైరవులకు శ్రీరాముఁడు సమానుఁడు,

వేయి గంధర్వులకును, నూరుకోట్ల దేవతలకును శ్రీరాముఁడు సమానుఁడు. నాలుగు వేదములు, పదునెనిమిది పురాణము లును, ఆఱు శాస్త్రములును, నూఱుకోట్ల తీర్థములును శ్రీరామనామముతో సమానము. నూఱు కోటానుకోట్ల మంత్ర ములను మంత్రార్థములను జేయు దేవర్షులును, బ్రహ్మర్షులును మహర్షులును, మత్సర రహితులగు విద్వాంసులును వీరంద ఱును శ్రీరామాంశమునఁ బుట్టిన వారలని బ్రహ్మవాదులు చెప్పుచుందురు. బ్రహ్మవాదులును వేదాంతులును పరం బ్రహ్మమనియు, యోగీంద్రులు పరమాత్మయనియు భక్తులు భగవంతుఁడనియు (విష్ణు కృష్ణ మొదలగు) వీరంద ఱెవనిని సేవించుచుందురో ఆతఁడు శ్రీరామచంద్రుఁడే. అనఁగా శ్రీరామచంద్రమూర్తికి గల పరత్వ మింకే దేవతకును లేదు. ఈ విషయము నింకను దెలిసికొన వలయుననిన మహాశంభు సంహిత, అగస్త్యసంహిత శేషసంహిత, భరద్వాజ సంహిత, వశిష్టసంహిత, సుందరీ తంత్రాదులలోఁ గననగును. రామునకును రామమంత్రమునకును భేదములేదు. శ్రీరామమంత్రమునుగూర్చి రామోత్తర తాపన్యుపనిషత్తులో నిట్లు చెప్పఁబడినది.

శ్లో॥ బ్రహ్మహత్యా సహస్రాణి, జ్ఞానాజ్ఞాన కృతానిచ,
స్వర్ణ స్తేయ సురాపాన, గురుతల్పాయుతానిచ॥
కోటికోటి సహస్రాణి, ఉపపాతక జాన్యపి,
సర్వాణ్యపి ప్రణశ్యంతి, రామమంత్రాను కీర్తనాత్॥
భూతప్రేత పిశాచాద్యాః, కూష్మాండ బ్రహ్మరాక్షసాః,
దూరాదేవ ప్రధావంతి, రామమంత్ర ప్రభావతః॥

ఐహాలౌకిక మైశ్వర్యం, సర్గాద్యం పారలౌకికమ్,
కైవల్య భగవత్త్వంచ, మంత్రోఽయం సాథయిష్యతి॥
గ్రామ్యారణ్య పశుఘ్నత్వం, సంచితం దురితం చ యత్
మద్యపానేన యత్పాపం, తదప్యాశు వినాశయేత్॥
అభక్ష్య భక్షణోత్పన్నం మిథ్యాజ్ఞాన సముద్భవమ్,
సర్వం విలీయతే రామ మంత్రస్యాస్యైవ కీర్తనాత్॥
శ్రోత్రియ స్వర్ణహరణా, ద్యచ్చ పాప ముపస్థితమ్,
రత్నాదే శ్చాపహారేణ, తదప్యాశు వినాశయేత్॥
బ్రహ్మణం క్షత్రియం వైశ్యం, శూద్రంహత్వాచకిల్బిషమ్,
సంచినోతి నరో మోహా, ద్యద్యత్త దపి నాశయేత్॥
మహాపాతక పాపిష్ఠ, సంగత్యా సంచితం చ యత్,
నాశయే తత్కథాలాప, శయనాసన భోజనైః॥
పితృమాత్ర వధోత్పన్నం, బుద్ధిపూర్వ మఘంచ యత్,
తదనుష్ఠాన మాత్రేణ, సర్వమేత ద్విలీయతే॥
యత్ప్రయాగాది తీర్థోక్త ప్రాయశ్చిత్త శతైరపి,
నైవాపనోద్యతే పాపం, తదప్యాశు వినాశయేత్॥
పుణ్యక్షేత్రేషు సర్వేషు, కురుక్షేత్రాదిషు స్వయమ్,
బుద్ధిపూర్వ మఘం కృత్వా, తదప్యాశు వినాశయేత్॥
కృచ్ఛ్రైస్సప్త పరాకాద్యై, ర్నానాచాంద్రాయణై రపి,
పాపం చ నాపనోద్యం య త్తదప్యాశు వినాశయేత్॥
ఆత్మతుల్య సువర్ణాది, దానై ర్బహువిధైరపి,
కించి దప్యపరిక్షీణం, తదప్యాశు వినాశయేత్॥

అవస్థా త్రితయే ష్వేవ, బుద్ధిపూర్వ మఘం చ యత్,
తన్మంత్ర స్మరణేనైవ, నిఃశేషం ప్రవిలీయతే॥
అవస్థా త్రితయేష్వేవం, మూలబంధ మంత్రంచ యత్,
తత్తన్మంత్రోపదేశేన, సర్వమేత త్ప్రణశ్యతి॥
ఆబ్రహ్మ బీజ దోషాశ్చ, నియమాతి క్రమోద్భవాః,
స్త్రీణాం చ పురుషాణాం చ, మంత్రేణానేన నాశితాః॥
యేషు యేష్వపి దేశేషు రామభద్ర ఉపాస్యతే,
దుర్భిక్షాది భయంతేషు, నభవేత్తు కదాచన॥
శాంతః ప్రసన్న వదనో, హ్యక్రోధో భక్తవత్సలః
అనేన సదృశో మంత్రో, జగత్స్వపి న విద్యతే॥
సమ్యగారాధితో రామః, ప్రసీదత్యేవ సత్వరమ్,
దదా ద్యాయుష్య మైశ్వర్యం, మంతే విష్ణుపదంచ యత్॥
— రామోత్తర తాపిన్యుపనిషత్.

రామమంత్రమును జపించుటవలన తెలిసియుఁ దెలియకయు వేయి బ్రహ్మహత్యలు చేసినపాపమును, బంగారు దొంగిలించుట, సారాయమును గ్రోలుట, గురుభార్యాసంగమము మొదలగు మహాపాతకములను పదివేలు చేసిన పాపమును, కోటికోట్లవేల ఉపపాతకము లొనర్చిన పాపమును ఇవన్నియు శ్రీరామమంత్రాను కీర్తనమువలన నశింపఁ గలుగును. శ్రీరామమంత్ర ప్రభావము వలన భూతప్రేత పిశాచాదులును, కూష్మాండాది గ్రహములును, బ్రహ్మరాక్షసులును దూరముగఁ బాఱిపోఁగలవు. ఇహలోకములోనికి యైశ్వర్య

[illegible], స్వర్గాదులును, పరలోక సుఖములును, కైవల్యమును, భగవత్త్వమును ఈమంత్రము సాధింపఁగలదు. గ్రామముల లోని పశువులను, అరణ్యములలోని పశువులను జంపిన పాపమును, అనేక జన్మలలోఁ బ్రోవుచేసికొని యనుభవింపక యుంచుకొనిన సంచిత పాపమును, మద్యపానము చేయుటచే వచ్చిన పాపమును ఈ రామమంత్రము వెంటనే నాశము చేయఁగలదు. అంతయును బరబ్రహ్మస్వరూపమును మిథ్యాజ్ఞానము వలనఁ గుడువరాని కూడు కుడిచినచో నిమంత్రముచే వెంటనే ఆపాప మంతయును బోఁగలదు. శ్రోత్రియుని బంగారమును హరించుటవలనఁ గలిగిన పాపము, రత్నాదులను హరించుటవలన సంభవించిన పాపమును ఈ మంత్రము వలనఁ దత్క్షణమే నశించిపోఁగలదు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను జంపుటవలన వచ్చిన పాతకమును గూడ బెట్టుకొనియుండిన నాపాపము నైనను నీమంత్రము నాశము చేయఁగలదు. మహాపాతకము లొనర్చిన పాపిష్ఠినితో స్నేహము చేసియు, అట్టివారితో మాటలాడుటచేతను, వారితోఁ బరుండుట, కూర్చుండుట, పంక్తిని గూర్చుండి భోజనము చేయుట చేతను వచ్చిన పాతకమును గూడ శ్రీరామమంత్రము పోఁగొట్టఁగలదు. బుద్ధిపూర్వకముగ తల్లి దండ్రులను జంపిన పాపమును శ్రీరామ మంత్రానుష్ఠానముచే నశింపఁగలదు. ప్రయాగాది తీర్థములలోఁ బ్రాయశ్చిత్తముచేఁ బోని పాపముకూడ వెంటనే శ్రీరామ మంత్రముచే నశింపఁగలదు. కురుక్షేత్రాది పుణ్యక్షేత్రము లన్నిటిలో బుద్ధిపూర్వకముగఁ జేసిన పాపమును

తత్క్షణము నశింపఁగలదు. కృచ్ఛ్ర, తప్తపరాకాములచేతను, చాంద్రాయణాది వ్రతములచేతను బోని పాపములన్నియును దీనివలన వెంటనే నశింపఁగలవు. తాను తూగినంత బంగారమును దానము చేయుటచేతను నశింపని పాపములు దీనివలన వెంటనే నశింపఁగలవు. జాగ్రత్స్వప్న సుషుప్త్యాది అవస్థాత్రయమునందు బుద్ధిపూర్వకముగఁ జేసిన పాపము ఈశ్రీరామ నామము నుపదేశించుటచేతనే సమస్తమును నశింపఁగలదు. స్త్రీలు గాని, పురుషులుగాని శాస్త్ర నియమాతిక్రమణము కావించి బ్రాహ్మణాది బీజసంకరమగుచో నాపాపముగూడ ఈమంత్రము వలన నశింపఁగలదు. ఏ యే దేశములలో శ్రీరామచంద్రమూర్తి యుపాసింపఁ బడుచున్నాఁడో అచ్చట యెన్నటికిని దుర్భిక్షాది భయములు కలుగనేరవు. శాంతస్వభావము కలవాఁడును, ప్రసన్నమగు ముఖము కలవాఁడును, క్రోధము లేని వాఁడును, తన్ను సేవించు భక్తులను వాత్సల్యముతోఁ జూచువాఁడు నగు శ్రీరామచంద్రుని మంత్రముతో సమానమగు మంత్రము జగత్తులో నెచ్చటనులేదు. బాగుగా శ్రీరామచంద్రుని ఆరాధించుచోఁ జాల శీఘ్రముగ ననుగ్రహించి ఆయుస్సును, ఐశ్వర్యమును బ్రసాదించుటయేగాక చివరకు విష్ణుపదమును గూడ లభింపఁ జేయఁగలడు.

ఇంతవఱకు ప్రాప్యస్వరూపమును గూర్చి చెప్పఁబడినది. ఇఁకఁ బ్రాప్తృస్వరూపమును గూర్చి చెప్పఁబడుచున్నది. ప్రాప్తృఁడు జీవుఁడు. కావున జీవ స్వరూపమును గూర్చి చెప్పఁబడుచున్నది.

## ప్రాప్తస్వరూపము

శ్లో॥ స్థూల సూక్ష్మ కారణాత్, భిన్నం కోశాచ్చ పంచకాత్
జాగ్రత్స్వప్నా ద్యవస్థానాం, సాక్షిభూతం తు సర్వదా॥
చిదానందమయం నిత్యం, దివ్య విగ్రహ సంయుతం,
అఖండైక రసంచైవ, కైశోరే వయసి స్థితమ్॥
ద్విభుజం సత్వ సంపన్న మీశ సేవా ప్రయోజనమ్,
ప్రభో ర్నియామ్యం శేషత్వం, జ్ఞాతవ్యం స్వస్వ రూపకమ్॥

తా॥ ముముక్షువు తన స్వరూపము నిట్లు తెలిసికొనవలెను. నా స్వరూపము మాయా విరచితమగు స్థూల సూక్ష్మ కారణ దేహములకు భిన్నమైనది. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయాది కోశములకు భిన్నమైన వాఁడను. సర్వదా జాగ్రత్స్వప్న, సుషుప్తి మొదలగు నవస్థలకు సాక్షీభూతుఁడను చిత్స్వరూపుఁడను, ఆనంద స్వరూపుఁడను, నిత్యుఁడను, దివ్యవిగ్రహుఁడను, అఖండైక రసమును ఎల్లప్పుడును కిశోరావస్థలో నుండువాఁడను, రెండు చేతులు కలవాఁడను, సత్త్వ సంపన్నుఁడను, భగవంతుని సేవయే ప్రయోజనముగాఁ గలవాఁడను, ప్రభువుచే నియమింపఁబడిన వాఁడను, శేషిని.

జీవస్వరూప మెట్టిదో యిచ్చట చెప్పఁబడు చున్నది. మనకు మూఁడు శరీరములు కలవు. పాంచభౌతికమైనదియు, ఈ చర్మచక్షువులకుఁ గనఁబడునదియు స్థూలశరీరము. పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము ఇవి పంచభూతములు.

ఈ పంచభూతములకు గుణములు కలవు. పృథివికి వాసన, జలమునకు రుచి, అగ్నికి రూపము, వాయువునకు స్పర్శ, ఆకాశమునకు శబ్దము. ఈ గుణములను వ్యక్తము చేయు నింద్రియము లేర్పడినవి. వాసన చూచుటకు ముక్కు, రుచి చూచుటకు నాలుక, రూపమునకు కన్నులు, స్పర్శకు చర్మము, శబ్దమునకు చెవులు. ఈ యైదును జ్ఞానేంద్రియములు. తర్వాత కర్మేంద్రియము లేర్పడినవి. పృథివి వలన మలేంద్రియము, జలమువలన మూత్రేంద్రియము, అగ్నివలన పాదేంద్రియము, వాయువు వలన హస్తేంద్రియము, ఆకాశమువలన వాగింద్రియము ఇప్పటికి ఇరువది తత్త్వములైనవి. ఇవిగాక మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అను అంతఃకరణ చతుష్టయము కలదు. మొత్తము ఇరువది నాలుగు తత్త్వములు ఈ యిరువది నాలుగు తత్త్వము కలది స్థూలశరీరము. అయిదు జ్ఞానేంద్రియములు, అయిదు కర్మేంద్రియములు, ప్రాణాపాన వ్యానోదాన సమానములను పంచప్రాణములు, మనస్సు, బుద్ధి ఈ పదునేడు తత్త్వములు కలిసి సూక్ష్మశరీరము అవిద్యామయమైనది కారణ శరీరము. ఈ మూడు శరీరముల కును విలక్షణమైనవాడు జీవుడు.

జీవుడు పంచకోశములకును భిన్నమైనవాడు. అన్నమయ కోశము, ప్రాణమయకోశము, మనోమయ కోశము, విజ్ఞానమయ కోశము, ఆనందమయ కోశమని కోశము లైదు, కోశమను పదము చేతనే ఈ కోశములను ధరించినవాడు జీవుడని గ్రహింపవచ్చును. కేవలము అన్నముచే నేర్పడు

ఇరువది తత్త్వములతోఁ గూడిన ఈ శరీరము అన్నమయ కోశము. ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము ఈ యైదును ప్రాణములు. ప్రాణము హృదయమున నుండును. ఇది శ్వాస, రక్త ప్రసరణాది కార్యములను జరుపును. అపానవాయువు గుదమున నుండును. ఇది మలమూత్రములను, ఇతర మలములను బయటకు వెడలించును. వ్యాన వాయువు శరీరమంతటనుండి స్పర్శాది కార్యములను, రక్త ప్రసరణమును, శరీరమంతటను జరుపవలసిన కార్యములను జరిపించుచుండును. ఉదానవాయువు కంఠమున నుండును. ఈవాయువే వాక్కు మీఁదను, మెదడు మీఁదను నెక్కువగఁ బనిచేయును. కంఠమునకుఁబైన జరుగు కార్యములన్నియు అనఁగా వినుట, వాసనచూచుట, చూచుట మొదలగున వన్నియు నీవాయువు వలననే జరుగుచున్నవి. సమాన వాయువు నాభివద్ద నుండును. ఇది ప్రాణాపానములను జాగ్రత్తగఁ బట్టియుంచును. జీర్ణక్రియ దీనివలననే జరుగును. ఈ యైదువాయువులును ప్రాణమయ కోశము.

మనోమయకోశము దీని కావలనుండును. సంకల్ప వికల్పములు జరుగున దిక్కడనే. ఇది ప్రాణముకంటెను సూక్ష్మమైనది. ఇది అతి చంచలముగ నుండును. విషయములను చింతించిన కొలఁది చంచల మగుచుండును.

మనోమయ కోశమున కావల విజ్ఞానమయ కోశము. ఇచ్చట బుద్ధియుండును. దీనినిఁ గొంద ఱాత్మగాఁ జెప్పుచుం

దురు. కాని విజ్ఞానమయ కోశమని యుండుటచే నిది యొన్నటి కిని ఆత్మ కాఁజాలదు. ఆత్మ దీనికి విలక్షణముగానే యుండ వలయును.

విజ్ఞానమయ కోశమున కావల నానందమయ కోశము. ఇచ్చట నానంద మనుభవించు చుండును. ఈ కోశస్థానమునే కొందఱు పరమాత్మగాఁ జెప్పుచుందురు. కాని యిదియుఁ గోశమగుటచే నట్లు కాఁజాలదు. ఈ యైదుకోశములకును విల క్షణముగ నున్న సాక్షిమాత్ర స్వరూపమే జీవాత్మ. అందు వలననే 'భిన్నం కోశాచ్చ పంచకాత్' అని చెప్పఁబడినది.

మనకు మూఁడవస్థలు కలవు. జాగ్రత్త, స్వప్నము, సుషుప్తి. ఆత్మ జాగ్రత్తను అభిమానించినపుడు విశ్వుఁడగు చున్నాడు. ఇచ్చట సమస్త తత్త్వములు పనిచేయుచుండును. విశ్వమును జూచువాఁడు కావున విశ్వుఁడు.

నిద్రించునప్పుడు స్వప్నావస్థ. ఇచ్చట శరీరముఖ, కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు పనిచేయకున్నను మనస్సు పనిచేయుచున్నది. ఒకానొక తేజస్సులో ననేక దృశ్యములను గాంచి యనుభవించుచున్నాఁడు. స్వప్నావస్థకు అభిమాని తైజసుఁడు.

నిద్రించు సమయమున నే కలయును రాకుండ మనస్సు కూడ తమస్సులో లీనమగును. అప్పుడేమియును దెలియదు. దీని కభిమాని ప్రాజ్ఞుఁడు.

పై మూడవస్థలలో విశ్వ, తైజస, ప్రాజ్ఞులు వరుసగా అభిమానులు. ఇట్లనుటచే నీముగ్గురును వేఱువేఱని భావింప రాదు. ఒకేదీపము వేఱువేఱు రంగు టద్దములలో వివిధరీతుల ప్రతిభాసించునట్లు, యథార్థమగు దీపము ఈ వివిధరంగులకును విలక్షణముగ నున్నట్లు ఈ జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలకు సాక్షిమాత్రుఁడుగ జీవుఁ డున్నాఁడు. అతఁడు జ్ఞాత. జాగ్రత్తులో జరుగు విషయములను, స్వప్నములో జరిగిన విషయములను, చివరకు మనస్సుకూడ సుషుప్తి చెందిన సుషుప్తిలో జరిగిన నిస్తబ్ధతను ఇట్లు అనుభవించితినని లేచిన తర్వాతఁ జెప్పుచున్నాఁడు. ఇట్లు చెప్పుటచే నట్టి సుషుప్తి స్థితిలోఁ గూడ సాక్షిమాత్రుఁడుగ నిత్యజాగ్రతిలో నొకఁడుండి తీరవల యునుగదా! అతఁడే జీవుఁడు.

ఆత్మ చిద్రూపము అనఁగా జ్ఞానస్వరూపము. ఆనంద మయము అనఁగా నానంద స్వరూపము. పరమాత్మ యెట్లు సచ్చిదానందుఁడో ఆత్మయు (జీవుడు) సచ్చిదానందమే. సముద్రమునకు నదికిని భేదమేమున్నది. అదియు నీరే. ఇదియును నీరే. అదియు ఉప్పనే. అయితే భేదము అది అనంతము, ఇది అంశము. అనఁగా భగవంతుఁడును సచ్చిదానంద స్వరూపుఁడే. జీవుఁడును సచ్చిదానంద స్వరూపుఁడే. కాని భగవంతుఁడు సర్వజ్ఞుఁడు. జీవుఁ డల్పజ్ఞుఁడు. అతఁడు సర్వశక్తి మంతుఁడు. ఈతఁ డల్పశక్తిమంతుఁడు. అతఁ డాధారము. ఈతఁ డాధేయము. అతఁడు స్వతంత్రుఁడు. ఈతఁ డాతనికిఁ బరతంత్రుఁడు. అతఁ డపరిచ్ఛిన్నుఁడు. ఈతఁడు ఘటఘటవాసి. ఇద్దరుమ

త్రికాలాబాధ్యులే. ఇద్దరికిని జనన మరణములు, షడ్భావ వికార ములును లేవు. శరీరమునకుఁ దాదాత్మ్యము చెందుటచే సది పరిణామ భూతమైన దగుటచే నజ్ఞానముచే నీతఁడును షడ్భావ వికారములను జెంది బాధపడుచున్నాఁడు. కావున నీతఁడు నిత్యుఁడు. ప్రకృతికి సంబంధించిన వాఁడు కాకపోవుటచే నీతఁడు దివ్యవిగ్రహ సంయుక్తుఁ డగుచున్నాఁడు. ఇది ప్రకృతికతీతమైనది. అందువలననే దివ్యము. శాస్త్రములలో 'వాలాగ్రశతభాగస్య' యను నుపనిషద్వాక్యములచే వెండ్రుకను నూఱుభాగములుగఁ జీల్చి, ఆభాగమును నింక నూఱుభాగములుగఁ జీల్చిన దాని చివరభాగమెంత సూక్ష్మముగ నుండునో జీవుఁ డంతటి సూక్ష్ముఁడనియు నాకార రహితుఁడనియుఁ జెప్పఁబడియున్నను భక్తుల భావనానుసారముగ దివ్యరూపమునుగ భావించుచున్నాఁడు. అఖండైక రసస్వరూపుఁడు. అతనిని ఖండింప వీలులేదు. ఏకరసమగుటచే నేక రూపముగానే యుండును.

'కైశోరే వయసి స్థితమ్' = అనుటచే భగవంతుఁడు నిత్య కిశోరుఁడుగ నుండునని ప్రాప్యమును గూర్చి చెప్పినపుడు చెప్పఁబడినది కావున నిచ్చట జీవస్వరూపము కూడ అట్లే చెప్పఁబడినది. ఆత్మ నిత్య యౌవనముగ నుండునని తాత్పర్యము.

ద్విభుజం అనుటచే, శ్రీరామచంద్రమూర్తికిని ద్విభుజములు కలవని చెప్పఁబడినది. అట్లే జీవునకును ద్విభుజములు కలవని చెప్పబడినది.

శుద్ధ సత్వసంపన్నుఁడు శ్రీరామచంద్రమూర్తి. అట్లే జీవుఁడును శుద్ధ సత్వసంపన్నుఁడే. ఇచ్చట సత్త్వగుణము ప్రకృతి గుణముకాదు.* ప్రకృతిగుణము మలిన సత్త్వము. అందుకనియే యిచ్చట శుద్ధసత్త్వమని చెప్పఁబడినది.

జీవునకు శ్రీరాముని సేవయే ప్రయోజనము. శ్రీరాముఁడు సేవ్యుఁడు. జీవుఁడు సేవకుఁడు. శ్రీరాముఁడు నియామకుఁడు. "ధియో యోనః ప్రచోదయాత్" యను గాయత్రీ మంత్రములోని ప్రేరకుఁడు నియామకుఁడు శ్రీరామచంద్రుఁడే. జీవుఁడు నియామ్యుఁడు. అనఁగా నాతఁ డెట్లు నియమించిన జీవుఁ డట్లు చేయుచుండును. కొందఱు ప్రపన్నులు అకార్యములను గూడ ప్రేరేపించునది ఆయనయే నని తృప్తిపడి ఆకార్యములను జేయుచుందురు. అది తప్పు. భగవంతుఁ డెన్నటికిని దుష్కార్యములను బ్రేరేపింపఁడు. ఆ కార్యమును, ఆ కార్యఫలమును ఆయనమీఁదకు ద్రోయఁ గూడదు. ఆ తప్పు కార్యము వలన వచ్చు ఫలితమునుగూడ భగవంతునిదే నని యనుకొనిన మేలే. అప్పు డేడ్చుచుందురు. దొంగతనము చేయించినది భగవంతుఁడే నని భావించువాఁడు రక్షకభటునిచే లాఠీ దెబ్బలు తినునపుడును భగవంతుఁడే యిట్లు శిక్ష నొసంగుచున్నాఁడని భావించి సంతోషముతో నుండవలయును. జీవుఁడు ప్రభువునకు శేషుఁడు. చందన, వస్త్ర, కుసుమాదులను దనకిష్టము వచ్చినట్లు ధరింపవచ్చును. ఇవన్నియు భోగ్యములు. వీటిని వినియోగించు కొనువాఁడు భోక్త. భోక్తయొక్క యిచ్ఛ ననుసరించి భోగ్యములయొక్క విని

కాఁగ నుండును. భోగ్యవస్తు వగు జీవునకు స్వతంత్ర ఆలోచన యుండరాదు. భగవదేచ్ఛానుసారముగ మెలఁగవలయును. సుఖదుఃఖములు, మానావమానములు, శీతోష్ణాది ద్వంద్వములు ప్రభువుయొక్క యిచ్ఛానుసారముగ సంభవించు చున్నవని తృప్తి చెంది జీవుఁడు నిత్యానందమున నుండవలయును. తరంగము సముద్రాధీనమై యుండును. సముద్రమును వదలిన తరంగమునకు ఉనికియే యుండఁజాలదు. తరంగము సముద్రము నాశ్రయించుకొనియే యుండవలెను. అట్లే ప్రతిజీవియు భగవంతుని ఆశ్రయించుకొనియే యుండవలెను. స్వస్వరూపమును దెలిసికొని యుండవలెను.

ఇంతవఱకు ప్రాప్తి, ప్రాప్తముల స్వరూపమును దెలిసికొంటిమి. ఇప్పుడు హనుమంతుఁడు ప్రాప్త్యుపాయమును గూర్చి చెప్పుచున్నాఁడు.

## ప్రాప్త్యుపాయము

శ్లో॥ సర్వభూత దయాచైవ, సర్వత్ర సమదర్శనమ్,
అన్యత్రా నిందనం చైవ, స్వేశే స్నేహాధికం తథా॥
గురావీశ్వర బుద్ధిశ్చ, తదాజ్ఞా పరిపాలనమ్,
స్వేశస్య తజ్జనానాంచ, సేవనం మాయయా వినా॥
ప్రభోః కృపావలంబిత్వం, భోక్తృత్వం తత్సమర్పితమ్,
సచ్ఛాస్త్రేషు:చ విశ్వాసః, ప్రాప్త్యుపాయ మిహోచ్యతే

తా॥ సర్వభూతములయందు దయకలిగి యుండుట, సర్వత్ర సమముగఁ జూచుట, ఇతరదేవతలను నిందింపకుండ

టయు, ఇష్టదైవమునందు అధికమగు ప్రేమకలిగి యుండు టయు, గురువునం దీశ్వరబుద్ధి కలిగియుండుట, గుర్వాజ్ఞను పరిపాలించుట, తన యిష్టదేవుని యొక్కయు, తనయిష్టదేవుని భక్తులయొక్కయు సేవ కపటరహితముగఁ జేయవలయును. ప్రభువుయొక్క కృపనే అవలంబనముగ గొనవలయును. ఆయనకు సమర్పించిన పదార్థములనే అనుభవింప వల యును. సచ్ఛాస్త్రములయందు విశ్వాసము కలిగియుండ వల యును. ఇవి యన్నియును ప్రాప్తియొక్క యుపాయములై యున్నవి.

ఉపాసకుఁడు విశ్వమునఁగల సమస్త ప్రాణులయందును దన యిష్టదైవమును జూడవలయును. అట్లు చూడఁగలిగిన నాఁడే ఆతనిభక్తి పరాకాష్ఠను జెందఁగలదు. కావున సర్వ భూతములయందును ఆత్మస్వరూపుఁడుగ నున్న శ్రీరామ చంద్రుని జూచుచు దయగలిగి యుండవలయును. 'సర్వత్ర సమదర్శనమ్' అనుటచే సమస్త భూతములయందును సమముగఁ జూడవలయును. గీతలో శ్రీకృష్ణభగవానుఁడు నిట్లే చెప్పి యుండెను.

శ్లో॥ విద్యావినయ సంపన్నే, బ్రాహ్మణే గవి హస్తినీ,
శుని చైవ శ్వపాకే చ, పండితా స్సమదర్శనః॥
— గీత.

విద్యావినయ సంపన్నుఁడగు బ్రాహ్మణునియందును, గోవునందును, ఏనుఁగునందును, కుక్కయందును, చండాలుని యందును బండితులు సమమును గాంచెదరు.

పైశ్లోకమునే నవీనులు ఆధారముగఁ దీసికొని నానా కూళ్లు కుడుచుచుఁ జెడిపోవుచున్నారు. ఇచ్చట సమమనఁగా బ్రహ్మ పదార్థమని అర్థము. దీనితర్వాత శ్లోకమందే 'నిర్గుణం హి సమం బ్రహ్మ' అని చెప్పఁబడినది. ఈ సమశబ్దము నిర్గుణపరబ్రహ్మను అనఁగా నాత్మను దెలుపుచున్నది. ఇచ్చట క్రియ 'దర్శనః' అని వాడఁబడియున్నది. దర్శనః అనఁగా చూచుచుందురు అని అర్థముకాని 'సమవర్తినః' అని చెప్పఁబడి యుండలేదు. మనవారిప్పుడు బాహ్యమున సమమని వర్తించుచున్నారు. అదియునుగాక ఇందు సమమును జూడవలసిన వస్తువులకు సప్తమీవిభక్తి ప్రయోగింపఁబడినది. అనఁగా బ్రాహ్మణుని యందు, గోవునందు, ఏనుఁగునందు, కుక్కయందు, చండాలునియందు అని ప్రయోగింపఁబడియుండుటచే వీని యన్నిటిలో నేదియో ఒక్క వస్తువు కలదు. దానిని సమముగఁ జూడవలయును. అనఁగా వీనిలోని పరబ్రహ్మ వస్తువు సమానమే. కావున 'సర్వత్ర సమదర్శనమ్' అను చోట సర్వభూతములందును, జడచేతనము లన్నిటియందును శ్రీరామచంద్రుని జూడవలయును. బాహ్యమునఁగల యెక్కువ తక్కువలు, సహ్యాసహ్యములు, మంచిచెడ్డలు ప్రాకృతికములు, బాహ్యములు మాత్రమే. పారమార్థికములు కావు. పరమార్థమున నన్నియు సమానములే. ప్రకృతియంతయు భిన్నమే. సమానముగ నున్న వస్తువులు రెండు ఈ ప్రకృతిలో లేవు. ఈ భిన్నత్వములో నేకత్వమును జూడవలయును.

"అన్యత్రానిందనమ్" ఇతర దేవతలను నిందింపరాదు. కొందఱు అనన్యభక్తి తమదని చెప్పుకొనుచు నితరదేవతలను నిందించు చుందురు. అనన్యభక్తి యనఁగా నన్యదేవత లేదను నర్థముకూడ కలదు. అనఁగా సర్వదేవతలును మనయిష్ట దేవతాస్వరూపములే. అన్యదేవతాద్వేష మెప్పుడు కలదో ఆ ద్వేషింపఁబడిన దేవతకు నీకు తెలియకయే పరత్వము నొసంగుచున్నావు. సాధారణముగ నుపాసింపఁబడు దేవతలకుఁ బరత్వము వేదములలో నీయఁబడినది. దానిని నమ్మినవారు ఆ దేవతనుపాసించు చుందురు. దానికి నీవు ద్వేషింపనేల? ఇద్దరు లేక బహుదేవతలు పరబ్రహ్మగా నున్నారని నీవు తలఁచు నెడల వీరినందఱను సృజించినవాఁ డింకొకఁ డుండ వలసి వచ్చును. అప్పుడైనను భగవంతుఁ డొక్కఁడనియే తేలుచున్నది. ఇఁక నితర దేవత లెవరందురా? వారంద అవయవరూపములు. భగవంతుని విశ్వరూప వర్ణనములో నీదేవతలందఱను నవయవములనుగఁ జెప్పఁబడినది. నీ యిష్ట దైవము పాదములమీఁద భక్తియా? ముఖమును, చెవులను, హృదయమును జూచిన ద్వేషమా? అది భక్తి కాఁగలదా? కావున నన్ని దేవతలందును నీయిష్టదైవమునే చూడవలెను. నీ యిష్టదేవత కన్యముగాఁ జూచి ద్వేషించుట దోషము. ద్వేషము ప్రకృతిగుణము. ఆగుణ మున్నంతవఱకును ముక్తి లేదు. ప్రకృతి గుణములను దాటిన ప్రకృతి కతీతమగు ముక్తి స్థానమును జెందవచ్చును. దేహాభిమానమును, అన్నవస్త్రాదు లందును, దారాపుత్ర బంధుమిత్రాదులందును ప్రీతిని వదల

లేదే, వారిని ద్వేషించుటలేదే? అంతటి ప్రీతి మనుష్యులకంటె నెంతో గొప్పవారగు దేవతలం దుండరాదా? అనన్యభక్తిని పాతివ్రత్యమునకు బోల్చుచుందురు. పతివ్రత తన భర్తను మిక్కిలి ప్రేమించును. ప్రేమింప వలయును. తనకు సర్వస్వము నాతఁడే. దానిని కాదని యేమూఢుఁడు ననఁడు. కాని యితర పురుషులను ద్వేషించిననే గాని, అవమానించిననే గాని, దూషించిననేగాని పతిభక్తి కుదురదా? ఇతర పురుషులకుఁ బతివ్రతయు సామాన్య గౌరవ మీయవచ్చును. దానివలనఁ బాతివ్రత్యమునకు భంగమురాదు. కాని తన స్వీయపురుషుని యందలి ప్రేమ, భక్తి వేఱు.

కావున నితర దేవతలను నిందింపరాదు. ఎవరెవరి కేయే దేవతయందు ప్రీతియో ఆయా దేవతనే, ఆరూపమునే యుపాసింప వలయును. కాని అన్య దేవతలను నిందింపరాదు. "ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా" యని శ్రుతులే చెప్పియున్నవి. ఒకే పరబ్రహ్మవస్తువు ఉపాసకుల భావన ననుసరించి వేఱు వేఱు నామములను, వేఱువేఱు రూపములను ధరించియున్నాఁడు. ఒకేబంగారము కంటె, కాసులు, గాజులు, వడ్డాణము మొదలగు వివిధరూపములను, వివిధ నామములను ధరించినది. ఈ విషయములో శ్రీరామ కృష్ణ పరమహంసులవారు రెండు మంచి యుపమానములను జెప్పియున్నారు. వాటినిచ్చట నుదాహరించుట యప్రస్తుతము కాఁజాలదు.

ఒకేవ్యక్తిని భార్య నాథా! యనియు, కుమారుఁడు 'తండ్రీ' యనియు, తండ్రి 'పుత్రా' యనియు, మనుమఁడు 'తాతా!' యనియు, అల్లుఁడు 'మామా!' యనియుఁ బిలుచుచుందురు. ఒకేవ్యక్తి ఒక్కొక్కరికి ఒక్కొక్క వరుస వాఁడు. ఎవ రేవరుసతోఁ బిలుచుచుందురో వా రావరుస తోడనే బిలువవలయును. మనుమఁడు ఆతనికొడుకును నీవును 'తాతా' యని బిలువవలయునని పట్టుఁబట్టరాదు. అట్లు పట్టుపట్టిన నది అజ్ఞానమే కాఁగలదు. అట్లే ఒకే పరమాత్మను భక్తులు 'రామా' యనియు, కృష్ణా యనియు, శివయనియు, ఆదిత్య యనియు, కాళీ యనియు, గణపతి యనియు పలు విధములుగఁ గొలుచుచున్నారు. అట్టియెడల వేఱువిధముగ నుపాసించు వారిని, వా రుపాసించు దేవతను ద్వేషించి దూషించువాఁడు పరమమూర్ఖుఁడనియు, భగవత్తత్త్వము బొత్తుగాఁ దెలియని వాఁడనియు గ్రహింప వలయును.

ఇఁక రెండవ యుదాహరణము:— ఆర్గురు గుడ్డివాండ్రు ఒక ఏనుఁగును గనుఁగొనఁ బోయిరి. ఒకఁడు తొండమును దడివి 'ఏనుఁగు గొట్టమువలె నుండు' ననెను. రెండవాఁడు కోఱలను తడివి 'కొమ్ములవలె నుండు'ననియు, మూఁడవ వాఁడు చెవులను దడివి 'ఏనుఁగు చేటలవలె నుండు' ననియు, నాల్గవవాఁడు తోఁకను దడివి 'ఏనుఁగు బెత్తమువలె నుండు' ననియు, మఱి అయిదవవాఁడు కాలిని దడివి 'ఏనుఁగు స్తంభమువలె నుండు'ననియు, ఆఱవవాఁడు పొట్టను దడివి 'ఏనుఁగు మిద్దెవలె నుండు'ననియుఁ బరస్పరము కలహించు

కొనుచుండిరి. అన్నియు నిజమే. అన్నియుఁ గలిసినఁ గాని ఏనుఁగు పూర్తికాదు. అట్లే ఒక్కొక్క భక్తుఁడు పరబ్రహ్మ యిట్లే యుండునని తన భావనానుసారముగఁ జెప్పుచు నితరుల భావనలను విని కలహించుచుండిన, వాఁడు అజ్ఞానులలో శిరోమణియనియే చెప్పవలసియుండును. కావున శ్రీరామ భక్తుఁ డగువాఁడు తనయిష్టదైవమునే మిక్కిలిగఁ బ్రేమించుచు నన్యదేవతా నిందనము మాత్రము చేయరాదు. తన దేవతనే భావించుచుండ వలయును.

గురువునం దీశ్వరబుద్ధి యుంచవలెను.

శ్లో॥ ఆచార్యం మాం విజానీయాత్, నావమన్యేత కర్హిచిత్,
న మర్త్య బుద్ధ్యాఽ సూయేత, సర్వదేవ మయో గురుః॥

ఆచార్యుని నన్ను (భగవంతుని) గాఁ దెలిసికొన వల యును. ఆతని నెన్నటికి నవమానింప రాదు. అతనిని మను ష్యునిగా భావించి అసూయ చెందరాదు. గురువు సర్వదేవ మయుఁడు.

గురువు నిజమునకు బద్ధుఁడు కాఁడు. అతఁడు భగవ దాదేశమునఁ గొందఱ నుద్ధరించుటకు భూమిపై నవతరించిన వాఁడు. అట్టి వానిని మనము గురులక్షణములను బట్టి సులభ ముగ గ్రహింప వచ్చును. అట్టివాఁడు మనవలెనే సాంసారిక గార్యములను జేయుచున్నను, మానవుఁడుగఁ గనఁబడు చున్నను, మానవుఁడు కాఁడు. గురువు కేవలము పరబ్రహ్మ స్వరూపమే. గురువునకును, గురువిచ్చిన మంత్రమునకును,

మంత్రాధిష్ఠాన దేవతకును భేదము లేనేలేదు. కావున గురువు నం దీశ్వరబుద్ధి యుంచవలయును.

ఆతఁడొసంగిన ఆజ్ఞలను బరిపాలింప వలయును. గురువు మంత్రోపదేశ సమయమునను, ఇతరత్రా ఉపదేశ సమయములందును, ఆతని గ్రంథములందును, చెప్పిన యాజ్ఞలను, నియమములను, సాధనలను జక్కఁగాఁ బరిపాలింప వలయును. ఆతఁ డేమూర్తి నెట్లు ధ్యానింపవలయునని చెప్పినదియు, మంత్రము నెట్లుపాసింపుమని యాజ్ఞాపించినదియు బాగుగ గ్రహించి యట్లు నడువవలయును. మనోవాక్కాయ కర్మలందు ఆతని యెడల భక్తియుక్తులై చరింపవలయును. ఆతఁడు చెప్పిన ఆధ్యాత్మిక మార్గమందు పరమ విశ్వాస ముంచి, దృఢముగ నా సిద్ధాంతమందే నిలువవలయును. లేకున్న నుద్ధరింపఁ బడుట యనుమానమే.

తన యిష్టదైవమును, తన యిష్టదైవమందు భక్తి కలిగిన యితర భక్తులయెడలను భక్తికలిగి కపట రహితముగ సేవించుట చాల ముఖ్యము. అనఁగా భగవద్భాగవత సేవ సాధకునకు మిక్కిలి యవసరము. ఏవస్తువునుగాని, ఏద్రవ్యమునుగాని, పదార్థమునుగాని సంపాదించుట భగవద్భాగవత సేవనము కొఱకే నని భావించి కపటరహితముగ సేవింపవలయును. భగవ ద్భాగవతసేవ మోక్షమునకు రాజమార్గము.

శాస్త్రమున ననేకోపాయములు భగవంతునిఁ జేరుటకుఁ జెప్పఁబడినవి. అన్నియుఁ జక్కని మార్గములే. కాని

వానినాచరించుటలోఁ జాల చిక్కులు కలవు. అనేక ఫలములుకూడ లభింపఁగలవు. అట్టి ఫలములు నశ్వరములగుటచే వానిని గోరరాదు. ఆ శ్రీరామచంద్రుని కృపనే కోరవలయును. సర్వఫలములు కృపవలననే లభింపవలయును. భగవంతునకును భగవత్కృపకును భేదములేదు. ఫలములను గోరితిమా భగవంతుఁడు చిక్కఁడు. కావునఁ గృపనే కోరవలయును.

భగవంతునికి సమర్పించిన పదార్థములనే ప్రసాదరూపముగ గ్రహింపవలయును. భగవంతునికి సమర్పింపనిది ఒక్క అణుమాత్రమైన ననుభవింపరాదు. ఒక్క అన్నమునే కాదు, గృహ దారా పుత్ర, క్షేత్రారామ విత్తాదులనుగూడ భగవంతునికి సమర్పించి ప్రసాదరూపముగ ననుభవింపవలెను. ఇట్లు చేసిన సంసారబంధమునకు ముఖ్యకారణమగు మమకారము నశించును. వీనిలో నేవి నష్టమైనను దుఃఖముండదు. కారణము ఇవి తనవి కావు కావుననే అధికముగనున్న వహంకారముండదు. కారణము తనవికావు కావుననే. ఇవన్నియుఁ దన ప్రభుని సొత్తు కాబట్టి మిక్కిలి జాగరూకతతోఁ బాలింపవలయును. భగవంతునికి బూజ కావించి, నివేదించిన ప్రసాదమునే గ్రహింపవలయును. మన పొట్టకై మనము పదార్థములను దయారు చేయరాదు. కేవలము భగవంతునికొఱకై మాత్రమే మనము పదార్థములను సేకరింపవలయును. పచనము చేయవలెను. ఆయనకే నివేదనము చేయవలెను. అట్లు నివేదించిన పదార్థమే భుజింపఁ దగినది. మిగిలిన పదార్థము

విష్పానమమని శాస్త్రములు చెప్పుచున్నవి. ఇట్లు భగవన్నివేది తాన్నమును భుజించుటచే నన్నదోషముకూడ లభింపదు.

శాస్త్రము లనేకములు కలవు. వివిధ శాస్త్రములు వివిధ సంప్రదాయములను బ్రతిపాదించినవి. పూర్వము వేదములలోను, పురాణములలోను, మహర్షులచేత వ్రాయఁబడిన గ్రంథములను ముఖ్యముగఁ బఠింప వలయును. వాటియందే విశ్వాసము కలిగియుండ వలయును. అదియును గాక అనేక సంప్రదాయిక గ్రంథములున్నను దన యుపాసనకుఁ బనికి వచ్చు గ్రంథములనే, ఇట్టి యుపాసనకుఁ బుష్టి నొసంగు గ్రంథములనే చదువవలయును. వాటియందు విశ్వాసముంచవలెను. ఒకవేళ ఇతర గ్రంథములను జదివినను మన కెంతెంతవఱకు గ్రహించి, మిగిలిన దానిని వదలి వేయవలయును. అన్యసంప్రదాయ గ్రంథములను జదువరాదనిన వానిని ద్వేషించి, దూషింపరాదు. అవి యుపయోగపడు వారుకలరు. వారికవి యుపయోగమే. ఇప్పటి వారిగ్రంథములు కొన్ని బయలుదేరుచున్నవి. అవి శాస్త్రానుసారముగ సంప్రదాయ సిద్ధముగ నున్ననే విశ్వసింప వలయును. కాని ప్రతిదానిని విశ్వసింపరాదు. అందుకనియే యిచ్చట 'సచ్ఛాస్త్రేషుచ విశ్వాసః' సచ్ఛాస్త్రములందే విశ్వాస ముంచవలయునని చెప్పఁబడినది.

ఇవన్నియుఁ దొమ్మిది యుపాయములు. తొమ్మిది సంఖ్య శ్రీరామునకు ప్రీతికరమైనది. నవమినాఁడేకదా శ్రీరాముఁడు పుట్టినది. వీరికి నవాన్నమన్న నిష్టము. నవోపచారములు, నవరత్నములు, నవపుష్పములు, నవభోగములు మొదలగునవి

యుష్టములు. నవసంఖ్య పూర్ణసంఖ్య ఇంతకంటెఁ బెద్దసంఖ్య లేదు. మిగిలిన అంకెలన్నియు నీ నవసంఖ్యలోనే యిమిడి యున్నవి. * ఆట్లే సమస్త సాధనలు పైనఁజెప్పిన తొమ్మిది సాధనములలోనే కలవని తాత్పర్యము. దీనికి ప్రతికూలము లైనవి భగవత్ప్రాప్తిని కలిగింప లేవు సరికదా, అవి విరోధి స్వరూపములు కూడ నగుచున్నవి. కావున వీటిని సాధకులగు వారు బాగుగా సాధించవలసి యుండును. ఇంతవఱకు భగవత్ప్రాప్త్యుపాయము, తెలిసినది. ఇఁక భగవత్ప్రాప్తి ఫలమును గూర్చి చెప్పఁ బడుచున్నది.

## భగవత్ప్రాప్తి ఫలము

శ్లో॥ ప్రారబ్ధం పరిభుజ్యాథ, భిత్వా సూర్యాది మండలమ్,
ప్రకృతే ర్మండలం త్యక్త్వా, స్నాత్వాతు విరజాంభసా॥
సవాసనం దేహద్వయం, విసృజ్య విరజో భవత్,
అతివేగేన తాం తీర్త్వా, ప్రాప్య సాకేతకం తథా॥

ప్రవిశ్య రాజమార్గేణ, సప్తావరణ సంయుతం,
నానారత్నమయం దివ్యం, శ్రీరామ భవనం శుభమ్॥

తత్ర శ్రీభరతాద్యైశ్చ, సేవ్యమానం సదా ప్రభుమ్,
విరాజమానం వైదేహ్యా, రత్నసింహాసనే శుభే॥
స్వభావనయా శ్రీరామం, ప్రాప్య సర్వ సుఖప్రదమ్,
పరానంద మయోభూత్వా, వస్థానం ఫల ముచ్యతే॥

* ఈ వివరమునకు మాచే రచింపబడిన పరమార్థ తత్త్వము చూడుడు.

తా॥ ప్రారబ్ధము ననుభవించి సూర్యాది మండలము లను భేదించుకొని, తర్వాతఁ బ్రకృతి మండలమును దాఁటి విరజానదీ జలమునఁ గ్రుంకి, వాసనా సహితముగ సూక్ష్మ కారణ దేహములను వీడి నిర్మలుఁడై అతివేగమున విరజానదిని దాఁటి, సాకేతమును జేరి రాజమార్గమున సప్తావరణ సంయుక్త మగు నానారత్నమయ దివ్యశుభ శ్రీరామభవనమును బ్రవే శించి, అచ్చట భరతాదులచే సదా సేవ్యమానుఁడును, వైదేహీ సమేతుఁడును, శుభరత్న సింహాసనమున విరాజ మానుఁడైన వాఁడును సర్వసుఖప్రదుఁడు నగు శ్రీరామ చంద్రుని భావనానుసారముగఁ బ్రాపించి పరమానంద మయుఁడై యుండుటను బ్రాప్తిఫలముగఁ జెప్పుదురు.

జీవునకు మూఁడు రకములగు కర్మ లుండును. ప్రారబ్ధము, సంచితము, ఆగామి. ప్రారబ్ధమనఁగా ననేక జన్మలలోఁ జేసిన కర్మలనుండి యీజన్మలో ననుభవించుటకు ప్రత్యేకింపఁబడినది. సంచితమనఁగా ననేక జన్మలలోఁ జేసిన పుణ్యపాపకర్మలనుండి ప్రారబ్ధమునకుఁ గొంత పోఁగా మిగిలి నది. ఆగామి యనఁగా ప్రారబ్ధము ననుభవించు సమయమునఁ గ్రొత్తగాఁ జేసిన కర్మము. ఇవి త్రివిధకర్మములు. 'ప్రారబ్ధం భోగతో నశ్యేత్' అనియుండుటచేఁ బ్రారబ్ధము నెంతవాఁడైన ననుభవించి తీరవలసినదే. 'తత్త్వజ్ఞానేన సంచితమ్' అని యుండుటచేఁ దత్త్వజ్ఞానము కలిగినచో ననేక జన్మార్జిత సంచితమంతయు నశించిపోఁగలదు. ఆగామికర్మ అహంకార మమకారములతోఁ జేసిన సంచిత ప్రారబ్ధములలోఁ జేరును.

భగవత్ప్రీత్యర్థముగఁ జేసిన అనఁగా నిష్కామ భావముతోఁ జేసిన నది బాధింపదు. ఇచ్చట ముక్త జీవి ప్రారబ్ధముననుభవించి సూర్యాది మండలములను భేదించుకొని పోవును. ప్రకృతి మండలమును దాటఁగానే అచ్చట విరజానది కలదు. దీనిలో స్నానమాడ రజోగుణ సంబంధమగు అహంకార మమకారములు నశించినవాఁడే అర్హుఁడు. అహంకార మమకారములు నశింపక ప్రకృతి మండలమును దాటుటే జరుగదు. గుణాతీతస్థితి యిచ్చట లభించిననే ప్రకృతిమండలమును దాటఁ గలుగును. విరజానదిలో స్నానమాడుటచే లింగ, కారణ దేహములు విడిపోయి విరజుఁడగును. అప్పుడు శుద్ధాత్మ స్వరూపముగ మాత్రముండును. ఇట్లు విరజానదిని అతివేగముగ దాటి అచ్చట సాకేతమును జేరును.

శ్లో॥ విరజాయాః పరే పారే, లోకో వైకుంఠ సంజ్ఞితః,
తన్మధ్యే రాజతేஉయోధ్యా, సచ్చిదానంద రూపిణీ॥
తత్రలోకే చతుర్వ్యూహా, రామనారాయణః ప్రభుః,
అయోధ్యాయాం యదా చాస్య, హ్యవతారో భవేదిహ॥
— వేదసారోపనిషత్తు.

విరజానది కావల వైకుంఠమను లోకము కలదు. దానిమధ్యలో అయోధ్యకలదు. అది సచ్చిదానంద రూపమైనది. ఆలోకములోఁ జతుర్వ్యూహుఁడగు రామ నారాయణుఁడుండును. ఆయన భూమిమీఁదఁగల అయోధ్యలో నవతరించి నపుడు రామ యను పేరునే పెట్టుకొనెను.

ఒక మహానగరములో ననేకములగు పేట లుండును. అట్లే వైకుంఠనగరములో ముఖ్యముగఁ బ్రభువుండు స్థానము నకు అయోధ్య యనియు, సాకేతమనియుఁ బేరు. 'దేవానాం పూరయోధ్యా' దేవతల పట్టణ మయోధ్య యని వేదమునఁ గలదు.

శ్రు॥ కించాఽఽయోధ్యా పురీనామ సాకేత ఇతి చోచ్యతే,
ఇమా మయోధ్యా మాఖ్యాయ, సాఽఽయోధ్యా
వర్ణ్యతే పునః॥

అనిర్వాచ్యత్వ మేతస్యాఽ వ్యక్తమేవానుభూయతే।
రామావతార మాధత్తే, విష్ణుః సాకేత సంజ్ఞితే॥
తద్రూపం వర్ణయిత్వా నిర్వచనీయం ప్రభోః పునః,
రూపమాఖ్యాయతే విద్ధి ర్మహాతః పురుషస్య హి,
ఇత్యథర్వణవేదే వేదసారోపనిషది ప్రథమఖండే॥

కాని అయోధ్యనే సాకేతపురియని యందురు. ఈ యయోధ్యకు విఖ్యాతి కలుగుటకై ఆ యయోధ్య వర్ణింపఁ బడుచున్నది. అనఁగా భూమండలముమీఁది అయోధ్యచే ననిర్వచనీయ అయోధ్య సూచితమగుచున్నది. సాకేతములో నున్న విష్ణువు రామనారాయణ నామములో నుండి రామావ తారమును ధరించుటచే ననిర్వచనీయు రాముని వర్ణించి యీ రామరూపము నందఱుఁ దెలిసికొనుటకు వర్ణింపఁబడుచున్నది. అని యిట్లు అధర్వణవేదములోని వేదసారోపనిషత్తులోఁ గలదు.

"రామస్య నామరూపంచ లీలా ధామ పరాత్పరమ్,
ఏ తచ్చతుష్టయుం నిత్యం సచ్చిదానంద విగ్రహమ్."

శ్రీరాముని యొక్క నామము, రూపము, లీలలు, అయోధ్య (సాకేత) ధామము ఇవి పరాత్పరములు. ఈ నాలుగును సచ్చిదానంద రూపములు కావున నిత్యములు.

ఆ అయోధ్యను గూర్చి సదాశివసంహితలో నిట్లు చెప్పఁబడినది.

శ్లో॥ మహర్లోకః క్షితేరూర్ధ్వ మేకకోటి ప్రమాణతః,
కోటిద్వయేన విఖ్యాతో జనలోకో వ్యవస్థితః॥
చతుష్కోటి ప్రమాణస్తు తపోలోకో విరాజితః.
ఉపరిష్టాత్తతః సత్య మష్టకోటి ప్రమాణతః॥
ఆపః ప్రవ్యాప్త కౌమారః కోటి షోడశ సంభవః,
తదూర్ధ్వం పతిసంఖ్యాతో హ్యుమాలోకస్తు నిష్ఠితః॥
శివలోక స్త దూర్ధ్వంతు ప్రకృత్యాచ సమాగతః,
విశ్వస్య పురతో వృత్తిః శివస్య పురతో బహిః॥
ఏతస్మా ద్బహిరావృత్తిః సప్తావరణ సంజ్ఞకః,
తదూర్ధ్వం కోటిపంచాశ త్క్రమా ద్దశగుణా త్పరమ్॥
భూమిరాపోనలో వాయుః ఖమహం చ త్రిధాపరమ్,
మహామాయాతేన ప్రకృతేః సప్తావరణ సంజ్ఞకః॥
తదూర్ధ్వం సర్వ తత్త్వానాం కార్యకారణ మానినామ్
నిలయం పరమం దివ్యం మహావైష్ణవ సంజ్ఞకమ్॥

శుద్ధస్ఫటిక సంకాశం నిత్య స్వచ్ఛ మహోదయమ్,
నిరామయం నిరాధారం నిరంబుధి సమాకులమ్॥

భాసమానం స్వవపుషా వయస్యైశ్చ విజృంభితమ్,
మణిస్తంభ సహస్రైస్తు నిర్మితం భవనోత్తమమ్॥
వజ్రవైడూర్య మాణిక్యై ర్గ్రథితం రత్నదీపకమ్
హేమ ప్రాసాద మావృత్య తరవః కామజాతయః॥

భూమినుండి పైన మహర్లోకము కోటికోసులదూరమున కలదు. జనలోకము రెండు కోట్ల కోసుల దూరమున నున్నది. తపోలోకము నాల్గుకోట్ల కోసుల దూరమున నున్నది. ఆ పైన బ్రహ్మలోక మెనిమిది కోట్లకోసుల దూరమున నున్నది. జలముచే వ్యాప్తమైనఁ గౌమారలోకము పదునాఱుకోట్ల కోసుల దూరమున నున్నది. ఆపైన నంతేదూరములో నుమాలోకమును, ఆ పైన శివలోకము ప్రకృతితోఁ గలిసియున్నది. విశ్వమునకు లోపలను, శివలోకము బయటను సప్తావరణములు కలవు. అనఁగా శివలోకమునుండి ఉమాలోకమువఱకు సామాన్య సప్తావరణములు కలవు. దీనికి పైన నేఁబది కోట్ల యోజనముల క్రమమునఁ బదిరెట్లు దూరమున పృథివి, జలము అగ్ని, వాయువు, ఆకాశము, రజోగుణము, తమోగుణము, సత్త్వగుణము, త్రిధాహంకారము, మహామాయ, మూలప్రకృతివఱకు సప్తావరణములు కలవు. బ్రహ్మాండ మింతవఱకే. దీనికిపైన సర్వసత్త్వములకును కార్యకారణమగు పరమ దివ్యనిలయము మహావైకుంఠము కలదు. అది శుద్ధస్ఫటిక సంకాశ

మును, నిత్యమును, స్వచ్ఛమును, మహాకాంతి యుక్తమును మాయా రహితమును, నిరాధారమును, కేవలము శూన్యాకారమం దున్నదియు, నలువైపులను జలములోఁ గూడుకొన్నదియు, తన శరీరముచే స్వయముగఁ బ్రకాశించునదియు వేల కొలఁది మణిస్తంభములతో నిర్మింపఁబడిన భవనములోఁ గూడుకొన్నదియు, వజ్రవైడూర్య మాణిక్యాదులు కూర్పఁబడినదియు, రత్నదీపములలోఁ గూడుకొన్నదియు, బంగారు వికారములగుఁ బ్రాకారములతోఁ జుట్టుకొనఁబడి అనేకములగుఁ గల్పవృక్షములతో శోభిల్లుచున్నది.

శ్లో॥ రత్నకుండై రసంఖ్యాత, పురుషై ర్నిలయ వాసిభిః,
స్త్రీరత్నైః పరమాహ్లాదైః, సంగీతధ్వని మోదితైః॥
స్తుతం చ సేవితం రమ్యం, రత్నతోరణ మండితమ్,
కారుణ్యరూపం తన్నీరం, గంగా యస్మా ద్వినిఃసృతా॥
అనంత యోజనోచ్ఛ్రాయ, మనంత యోజనాయతమ్,
యత్రశేతే మహావిష్ణు ర్భగవాన్ జగదీశ్వరః॥
సహస్ర మూర్ధా విశ్వాత్మా, సహస్రాక్షః సహస్రపాత్
యస్మిన్నేషా జగత్సర్వం, లయీభూతం వ్యవస్థితమ్॥
ఇంద్రకోటి సహస్రాణాం, బ్రహ్మణాంచ సహస్రశః,
ఉద్భవంతి వినశ్యంతి, కాలజ్ఞాన విడంబనైః॥
యదంశేన సముద్భూతా బ్రహ్మవిష్ణు మహేశ్వరాః,
కార్యకారణ సంపన్నా గుణత్రయ విభావకాః
యత్ర ఆవర్తతే విశ్వం యత్రైవచ ప్రలీయతే॥

తద్వైదా పరమం ధామ మదీయం పూర్వసూచితమ్॥
ఏతద్గుహ్యా సమాఖ్యాతం దదాతు వాంఛితం హినః॥

అచ్చట అసంఖ్యాకములగు రత్నకుండములు గలవు. అచ్చట పురుషులు మలయసుగంధ చందనములను ధరించి యుందురు. అచ్చటి స్త్రీలు పరమాహ్లాదముతో సంగీతాది ధ్వనులతో మోదించు చుందురు. స్తుతులు, సేవలు చేయు చుందురు. రమ్యమగు రత్నతోరణములతోఁ గూడియుండును. కరుణారూపమున గంగాజల మచ్చటనుండియే బయలుదేరి నది. అనంతయోజనముల పొడవు కలిగినదియు, ననంత యోజ నముల వెడల్పు కలిగినదై యున్నది. జగదీశ్వరుఁడగు మహా విష్ణు వచ్చట శయనించి యుండును. ఆయనకు సహస్ర శిర ములు, సహస్రనేత్రములు, సహస్ర పాదములు కలవు. ఆయన విశ్వాత్మ. ఆయన కన్నుమూసిన జగత్తులు లయించును. కన్నులు తెఱచిన ప్రభవించును. వేలకోట్ల ఇంద్రులు, వేయి మంది బ్రహ్మలు పుట్టుచుందురు, చచ్చుచుందురు. కాల జ్ఞానమును బొంది ఆయన అంశముతో బ్రహ్మ, విష్ణు, మహే శ్వరు లుద్భవించుచుందురు. కార్యకారణ సంపన్నులై వారు గుణత్రయ విభాగము చేయువారగు చుందురు. అచ్చట నుండియే విశ్వ ముద్భవించును. అచ్చటనే లయించును. ఆ పరమధామము నేను పూర్వము సూచించియుంటిని. ఈ రహ స్యము నెవరు చెప్పెదరో వారికి మనోవాంఛలు నెఱవేరును.

శ్లో॥ తదూర్ధ్వం తు పరం దివ్యం సత్యమన్య ద్వ్యవ స్థితమ్,
న్యాసినాం యోగినాం స్థానం భగవ ద్భావనాత్మనామ్॥
మహాశంభు ర్మోదతేఽత్ర సర్వశక్తి సమన్వితః
తదూర్ధ్వ తు పరం కాంతం మహావైకుంఠ సంజ్ఞకమ్॥
వాసుదేవాదయ స్తత్ర విహరంతి స్వరూపవాన్,
రాఘువస్య గుణో దివ్యో మహావిష్ణు స్వరూపవాన్॥
వాసుదేవో ఘనీభూత స్తను తేజో మహాశివః
తదూర్ధ్వంతు స్వయం భాతో గోలోకః ప్రకృతేః పరః॥
వామనో గోచరా తీతో జ్యోతీరూపః సనాతః॥

దీనికి పైన పరముదివ్యమును జ్యోతీరూపము నగు నిరాధారమగు సత్యలోకము కలదు. అది సన్యాసులకును, యోగులకును, హరిభక్తులకును స్థానమై యున్నది. ఇచ్చట మహాశివుఁడు సర్వశక్తులతోఁగూడి ఆనందించు చుండును. దానికి పైన పరము దివ్యమును, గాంతియుక్తము నగు మహా వైకుంఠలోకము కలదు. అచ్చట వాసుదేవాది చతుర్వ్యూహ మూర్తులు తమతమ మాయలలో విహరించు చుండును. ఇదివఱకు చెప్పిన మహావిష్ణువు శ్రీరామచంద్రుని గుణము, శ్రీరాముని శరీరతేజస్సు మహాశివుఁడు. దీనికి పైన అయిదు వందల కోట్ల యోజనముల దూరమున మాయకావల గోలోకము కలదు. అది స్వయంప్రకాశ మానమైనది. మనోవాగాది యింద్రియములకుఁ బరమైనది. జ్యోతిస్వరూపమైనది. సనాతనము.

శ్లో॥ తస్య మధ్యే పురం దివ్యం, సాకేతమితి సంజ్ఞకమ్,
యోషిద్రత్న మణిస్తంభ, ప్రమదాగణ సేవితమ్॥
తన్మధ్యే పరమోదారః, కల్పవృక్షో వరప్రదః,
తస్యాఽధః పరమం దివ్యం, రత్నమండప ముత్తమమ్॥
తన్మధ్యే వేదికా రమ్యా, స్వర్ణరత్న వినిర్మితా,
తన్మధ్యే చ పరం శుభ్రం, రత్నసింహాసనం శుభమ్॥
సహస్రారం మహాపద్మం, కర్ణికాయై స్సముత్తమమ్॥
తన్మధ్యే ముద్రికాభిన్నం, ముద్రాద్వాభ్యాం విభిన్నకమ్,
వహ్నింధుమండలే నాపి, వేష్టితం బిందు భూషితమ్॥
చంద్రకోటి ప్రతీకాశం, ఛత్రకం చ సచామరమ్,
సదాఽమృత ఘనస్రావి, ముక్తాదామ వితానకమ్॥

ఆ గోలోకము మధ్య దివ్యమగు సాకేతపురముకలదు. అచ్చట మణిస్తంభములు కలవు. స్త్రీరత్నములచే సేవింపఁబడుచుండును. దాని మధ్యయందు పరమోదారమగుఁ గల్పవృక్షము కలదు. ఆకల్పవృక్షము క్రింద పరమదివ్య రత్నములతో నిర్మింపఁబడిన మండపముకలదు. ఆమండప మధ్యమున స్వర్ణరత్న రచితమగు సుందరవేదిక కలదు. ఆ వేదికా మధ్యమున నత్యంతోజ్జ్వలమును, మంగళ దాయకము నగు రత్నసింహాసనము కలదు. దానిపైన సహస్ర దళకమలము కలదు. దానిలో నుత్తమమగు కర్ణిక కలదు. దానిమధ్యమున నొక ముద్రికా భిన్నము కలదు. గోళాకారమగు దాని క్రింద భాగమున రెండు ముద్రాభిన్నములు కలవు. చంద్రాగ్ని

మండలములచే వేష్టితమై యున్నది. బిందువుచే విభూషితమై యున్నది. కోటిచంద్రులతో సమానమగు ఛత్రమును, చామరమును గలవు. దానిపై నమృత సమానమగు మేఘము వర్షించుచుండును. ముత్యాల సరములచే గూడిన వితానము (చాందినీ) కలదు. దానిశోభ అపారము.

శ్లో॥ తన్మధ్యే జానకీ దేవీ, సర్వశక్తి నమస్కృతా,
తత్రాస్తే భగవాన్ రామః, సర్వదేవ శిరోమణిః॥
తత్రాహం చింతయే త్తేజో, వహ్నిరూపం సశక్తికమ్,
తేజసా మహతా శ్లిష్ట మానంద్రైకాగ్ర మందిరమ్॥
ఏకాగ్ర మనసా పశ్యే, త్తత్ర దేవం సువిగ్రహమ్,
స్నిగ్ధ మిందీవరశ్యామం, కోటీందు లలితద్యుతిమ్॥
చిద్రూపం పరమోదారం, వీరభద్రం రఘూద్వహమ్,
ద్విభుజం మధురం శాంతం, జానకీ ప్రేమవిహ్వలమ్॥
దోర్దండ చండకోదండం, శరచ్చంద్ర మహాభుజమ్,
సీతాలింగిత వామాంగం, కామరూపం రసోత్సుకమ్॥
తరుణారుణ సంకాశం, వికచాంబుజ పాదకమ్,
పదద్వంద్వం నఖశ్చంద్రః, ప్రియతేజ స్సమావృతమ్॥
కూర్మపృష్ఠ పదాభాసం, రణన్మంజీర పాదకమ్,
కటిసూత్రాంకిత శ్రీశం, యజ్ఞసూత్రై రలంకృతమ్॥
రత్నకంకణ కేయూర, శోభితాగ్ర భుజద్వయమ్,
చంద్రకోటి ప్రతీకాశం, కౌస్తుభేన విరాజితమ్॥

ఆ సింహాసన మధ్యమున సర్వశక్తులచే నమస్కరింపఁబడు జానకీదేవియు, సర్వదేవ శిరోమణియగు శ్రీరామచంద్రుఁడును ఆసీనులై యుందురు. అచ్చట ముందుగా శక్తితోఁ గూడిన అగ్నిరూపమును జింతింపవలయును. మహాతేజస్సుతోఁ గూడుకొనిన ఆనందైకాగ్ర మందిరము నాదేవతా విగ్రహమును ఏకాగ్రమగు మనస్సుతోఁ జూడవలయును. కోమల శ్యామలశరీరుఁడును, కోటిచంద్రులఁబోలు లలితకాంతి కలవాఁడును, చిద్రూపుఁడును, మిక్కిలి యుదారుఁడును, వీరభద్రుఁడును, రఘుకులములో నవతరించిన వాఁడును, రెండు చేతులు కలవాఁడును, మధురశాంత స్వరూపుఁడును, జానకీ ప్రేమయందు విహ్వలుఁడైన వాఁడును, రెండుచేతులలో ధనుర్బాణములను ధరించినవాఁడును, శరద్రుతువులోని చంద్రుని బోలినవాఁడును, మహాభుజములు కలవాఁడును, ఎడమ భాగమున సీతాదేవిని కౌఁగిలించుకొని యున్నవాఁడును, కామరూపుఁడును, రసోత్సుకత కలవాఁడును, అప్పుడప్పుడు వికసించిన నెత్తుకలువనుబోలు పాదములు కలవాఁడును, రెండు పాదపద్మములయొక్క గోరులను చంద్రులచే నలుదిక్కుల ప్రకాశము కలిగించువాఁడును, కాంతియుక్తములగు మంజీర శబ్దములతోఁ గూర్మపృష్ఠముపైఁ బూజింపఁబడు పాదములు కలవాఁడును, కటిసూత్రము కలవాఁడును, యజ్ఞోపవీతముచే నలంకరింపఁబడిన వాఁడును, రత్నకంకణములతోడను కేయూరము (బాజుబందు)లతోడను శోభించు భుజద్వయము కల

వాఁడును, కోటిచంద్రులతో సమానమగుఁ బ్రకాశమానము కలవాఁడును, కౌస్తుభమణితో విరాజిల్లువాఁడునైయున్నాఁడు.

శ్లో॥ దివ్యరత్న సమాయుక్తం, ముద్రికాభి రలంకృతమ్,
నాసాంతైక సమాయుక్తం, ముక్తాఫల స్ఫురన్ముఖమ్॥
సూర్యకోటి ప్రతీకాశం, చంద్రకోటి ప్రమోదకమ్,
విద్యుత్కోటి చలచ్ఛుభ్రం, కుండలాది శ్రుతిస్పృశమ్॥
ప్రవృత్తారుణ సంకాశం, కిరీటేన విరాజితమ్,
గోవిందం గోవిదాం శ్రేష్ఠం, చిన్మయానంద విగ్రహమ్॥
దివ్యాయుధ సుసంపన్నం దివ్యాభరణ భూషితమ్,
అక్షరం కేవలం బ్రహ్మ, పీతకౌశేయ వాససమ్॥
శంఖచక్ర గదాపద్మ, చర్మాసి హలమూసలైః,
తద్రూప వివిధాకారైః, సేవ్యమానం పరాత్పరమ్॥
వశిష్ఠ వామదేవాది, మునిభిః పరిసేవితమ్,
లక్ష్మణం పశ్చిమే భాగే, ధృతచ్ఛత్రం సుచామరమ్॥
ఉభౌ భరత శత్రుఘ్నౌ తాలవృంత కరాంబుజౌ,
అగ్రే వ్యగ్రం హనూమంతం, వాచయంతం సుపుస్తకమ్॥

దివ్యరత్నములు కూర్పఁబడిన ముద్రికలను ధరించిన వాఁడును, ముక్కునకు ముక్తామణిని ధరించినవాఁడును, నవ్వు ముఖము కలవాఁడును, కోటి సూర్యులతో సమానమగు కాంతి కలవాఁడును, కోటిచంద్రులతో సమానమగు నానందము నొసంగువాఁడును, కోటిమెఱుపుతీఁగ లొక్కసారిగా మెఱసిన నెంతకాంతి కలుగునో అంతటి కాంతిగల కుండల

ములు ధరించిన చెవులు కలవాఁడును, తప్తకాంచనముతోఁ జేయఁబడిన రొమ్మిని కిరీటమును ధరించినవాఁడును, సర్వేంద్రియములకు నధిపతియైన గోవిందుఁడును, సచ్చిదానంద స్వరూపుఁడును, దివ్యాయుధములతోఁ గూడుకొన్నవాఁడును, దివ్యమగు నాభరణములతో నలంకరింపఁబడిన వాఁడును, కేవలము అక్షర పరబ్రహ్మస్వరూపుఁడును, పచ్చని పట్టువస్త్రమును ధరించిన వాఁడును, శంఖము, చక్రము, గద, పద్మము, చర్మము (డాలు), ఖడ్గము, నాగలి, రోఁకలి వీనిని ధరించిన వాఁడును, అనేక రూపములతో నుండి సేవింపఁ బడువాఁడును, పరాత్పరుఁడును, వసిష్ఠ, వామదేవాది మహామునులచేఁ జుట్టుకొనఁబడి సేవింపఁబడు చున్నాఁడు. పశ్చిమ భాగమున లక్ష్మణుఁడు ఛత్రచామరములను బట్టుకొని యున్నాఁడు. భరతశత్రుఘ్నులిద్దఱును విసనకఱ్ఱలను గైకొని విసరుచున్నారు. ఎదురుగా హనుమంతుఁడు చక్కని పుస్తకమును జదువు చున్నాఁడు.

పైన జెప్పినట్లు మోక్షస్థానమగు నయోధ్యలో నుండును. అట్టి సుఖకరమగు నయోధ్య శ్రీరామభక్తునకుఁ బ్రాప్యస్థానము. అయోధ్య కీక్రింది పేర్లుకలవు.

శ్లో॥ అయోధ్యా నందనీ సత్యా, నామ్నా సాకేత ఇత్యపి,
కోశలా రాజధానీ చ, బ్రహ్మపూరాఽ పరాజితా॥
అష్టచక్రా నవద్వారా, నగరీ ధర్మసంపదామ్,
దృష్ట్వైవం జ్ఞాన నేత్రేణ, ధ్యాతవ్యా సరయూస్తథా॥
— శివసంహిత ౫ పటలము - ౨౦ అధ్యా.

అయోధ్యా, నందనీ, సత్యా, సాకేత, కోశల, బ్రహ్మ పుర, అపరాజిత ఇవన్నియు నయోధ్యకుఁ బేర్లు. ధర్మ సంపత్తులో నయోధ్య అష్టచక్రములు, నవద్వారములు కలిగి యున్నది. దీనిని జ్ఞాన నేత్రముతోఁజూచి ధ్యానము చేయ వలెను. అట్లే దివ్యసరయూనదిని గూడ ధ్యానము చేయ వలెను. నిజమున కంతయు నయోధ్యయే.

శ్లో॥ రాసస్థాన మయోధ్యైవ, ధర్మస్థానం సనాతనమ్,
ముక్తిస్థాన మయోధ్యైవ, భక్తిస్థానం చ శాశ్వతమ్॥
ధర్మస్థాన మయోధ్యాఽఖ్యం, రంగముక్తి పదం స్మృతమ్,
ద్వారికా భక్తికృత్థ్సానం, రసస్థానం తు మాధురమ్॥
సర్వమేత దయోధ్యైవ, సూక్ష్మదృష్టి సమర్పణే,
తత్రాశోకవనం రమ్యం, రసస్థానం హి కేవలమ్॥
తన్మధ్యే జానకీరామౌ, నిత్యం లీలారతౌ స్థితౌ,
సహితౌ వనితా యూథైః, శతైరపి మనోహరైః॥

— శివసంహిత-౫ పట—౨౦ అధ్యా.

రాసస్థాన మయోధ్యయే. సనాతనమగు ధర్మస్థానమును, ముక్తిస్థానమును అయోధ్యయే. శాశ్వతమగు భక్తిస్థానమును, ధర్మస్థానమును అయోధ్యయే. రంగనాథుఁడు ముక్తినొసంగు నని చెప్పఁబడినది. ద్వారకాపురి భక్తికృత్య స్థానము. మథురానగరము రాసస్థానము. ఇవన్నియు నయోధ్యతే. వీటిని జ్ఞానదృష్టిచేఁ జూడవలయును. అచ్చట రమ్యమగు అశోకవనము కలదు. అది కేవలము రసస్థానమే. దానిలో

శ్రీసీతారాములిద్దరును నూర్లకొలఁది మనోహర రమణీ మణులతో నిత్యలీలలు జరుపుచుందురు.

శ్లో॥ అయోధ్యా నగరీ నిత్యా, సచ్చిదానంద రూపిణీ,
యస్యాం శాంశేన వైకుంఠా, గోలోకాది ప్రతిష్ఠితాః॥
యత్ర శ్రీ సరయూ నిత్యా, ప్రేమవారి ప్రవాహినీ,
యస్యాంశాంశేన సంభూతా, విరజాది సరిద్వరాః॥
పూర్ణః పూర్ణతమః శ్రీమాన్ సచ్చిదానంద విగ్రహః,
అయోధ్యాం క్వాపి సంత్యజ్య, స క్వచిన్నైవ గచ్ఛతి॥
—శివసంహిత- ౫ పట—౨౭ అధ్యా.

అయోధ్యానగరము నిత్యము. సచ్చిదానంద రూపిణి. దానియొక్క అంశాంశచేతనే వైకుంఠము, గోలోకము మొదలగు లోకములు ప్రతిష్ఠితమై యున్నవి. ప్రేమరూపమగు జలముతోఁ బ్రవహించు సరయూనది నిత్యమైనది. దానియొక్క అంశాంశముచే విరజాది నదు లుద్భవించినవి. పూర్ణుఁడును, పూర్ణతముఁడును, సచ్చిదానంద విగ్రహుఁడు నగు శ్రీరామచంద్రుఁడు అయోధ్యను వదలి యెచ్చటికినిఁ బోవఁడు.

శ్రు॥ యాఽయోధ్యాపురీ సా సర్వవైకుంఠానామేవ మూలాధారా మూలప్రకృతేః పరా తత్సద్బ్రహ్మమయా విరజోత్తరా, దివ్యరత్నకోశాఢ్యాయాం తస్యాం నిత్యమేవం సీతారామయో ర్విహారస్థల మస్తీ త్యథర్వణశ్రుతిః॥ దేవానాం పుర్యయోధ్యా తస్యాం హిరణ్మయః కోశః స్వర్గలోకో జ్యోతిషావృతా యోవై తాం బ్రహ్మణో వేదా మృతేన

వృతాం పురీం తస్మై బ్రహ్మాచ బ్రహ్మాచ ఆయుః కీర్తిం ప్రజాం దదు రితి సామవేదే తైత్తిరీయశ్రుతిః॥

"అయోధ్య సర్వవైకుంఠము (ముక్తస్థానము) లకు మూలాధారమైనది. మూలప్రకృతి కావలనున్నది. అది శాశ్వతమైనది. బ్రహ్మమయము. విరజానదికి ఉత్తరమున నున్నది. దివ్యరత్న కోశములతో నిండియున్నది. దానిలోనే నిత్యముగా శ్రీసీతారాముల విహారస్థలము కలదు." అని అథర్వవేదమున గలదు. ఇంక సామవేద తైత్తిరీయ శ్రుతిలో నిట్లున్నది. "దేవతలుండు పురము అయోధ్య. దానిలో హిరణ్మయ కోశము కలదు. స్వర్గలోకము. అది జ్యోతిస్సుచే నావరింపఁబడినది. జ్ఞానామృతముచే నావరింపఁబడిన యీపురి నెవఁడు, తెలిసికొనునో వానికి బ్రహ్మ ఆయుస్సును, కీర్తిని, సంతతి నిచ్చుచున్నాఁడు.

శ్లో॥ సర్వేభ్య శ్చాపి లోకేభ్య, శ్చోర్ధ్వ ప్రకృతి మండలాత్,
విరజాయాః పరే పారే, వైకుంఠం యత్పరం పదమ్॥
తస్మా దుపరి గోలోకః, సచ్చిదింద్రియ గోచరమ్,
తన్మధ్యే రామధామాస్తి, సాకేతం యత్పరాత్పరమ్॥
— వసిష్ఠసంహిత.

సమస్తలోకములకుఁ బైన ప్రకృతిమండలమున కావల విరజానదిని దాఁటిన తర్వాతఁ బరమ పదమగు వైకుంఠము కలదు. దానికిపైన గోలోకము కలదు. అది సచ్చిదానంద స్వరూపమైనది. అది యీబాహ్యేంద్రియములచేఁ దెలియఁ

బడనిది. దానిమధ్యలో పరాత్పరమగు సాకేతమను పేరుగల శ్రీరామ ధామము కలదు.

ఇట్టిస్థానమునకే మనము (శ్రీరామోపాసకులు) పోవుదుము. కావున ఫలస్థానమిదియే. ఇక విరోధమును గూర్చి తెలిసికొనవలసి యున్నది.

## విరోధి స్వరూపము

శ్లో॥ అనాత్మ న్యాత్మ బుద్ధిస్తు, స్వాత్మ శేషిత్వ భావనా,
భగవద్దాస్య వైముఖ్యం, తదాజ్ఞోల్లంఘనం తథా॥
బ్రహ్మేశేంద్రాది దేవానా, మర్చనం వందనాదికమ్,
అసచ్ఛాస్త్రాభిలాష శ్చ, సచ్ఛాస్త్ర స్యావ మాననమ్॥
మర్త్య సామాన్య భావేన, గుర్వాదౌ నాతిగౌరవమ్,
స్వాతంత్ర్యం చాప్యహం కారో, మమకార స్తథైవచ॥
ద్వాదశీ విముఖత్వంచ, హ్యకృత్యకరణం తథా,
జ్ఞేయ విరోధిరూపం తు, స్వస్వరూపస్య సర్వదా॥
ఏవం తత్వ పరిజ్ఞానా దాచార్యానుగ్రహేణ హి,
తత్క్షణా జ్జానకీనాథే ప్రీతి ర్నిత్యాభిజాయతే॥

అనాత్మ విషయముల యందాత్మ బుద్ధియుఁ దన్ను శేషిగా భావించుటయును, భగవద్దాస్యమునందు విముఖత పూనుటయు, భగవదాజ్ఞల నుల్లంఘించుట, బ్రహ్మ, రుద్ర, ఇంద్రాది దేవతలను బూజించుటయు, వారికి నమస్కారాదులు చేయుటయును, అసచ్ఛాస్త్రములం దభిలాష కలిగి

యుండుటయును, సచ్ఛాస్త్రముల నవమానించుటయును, గురువు మొదలగు వారలను మనుష్యులని భావించి అతిశయముగ గౌరవింపకఁ బోవుటయు, స్వాతంత్ర్యమును భావించుటయు, అహంకార మమకారములు కలిగియుండుట, ఏకాదశీ ద్వాదశీ వ్రతములందు విముఖత్వమును గలిగియుండుటయు, అకృత్యములు చేయుటయు, ఇవియే వాస్తవిక స్వరూపప్రాప్తి పూర్వకమగు భగవత్ప్రాప్తికి విరోధులు. ఇట్టి తత్త్వమును బాగుగాఁ దెలిసికొనుటవలనను, ఆచార్యానుగ్రహముచేతను, తత్క్షణమే శ్రీరామచంద్రుని యందు నిత్యమగుఁ బ్రీతి కలుగఁగలదు.

విరోధి స్వరూపమును దెలిసికొనుటయనఁగా మనము చేయఁగూడని పనులేమియో తెలిసికొనుట యగును. శరీరము, ఇంద్రియములు, మనస్సు మొదలగునవి అనాత్మలు. శరీరమే నేననుకొనుట, ఇంద్రియ, మనస్సులతోఁ దాదాత్మ్యమును జెందుట గొప్ప దోషము. స్వస్వరూపమును గూర్చి యిదివఱకే చెప్పియుంటిమి. అట్టి భావము కలిగియుండవలయును. భక్తుఁ డెల్లప్పుడును భగవంతునకు దాసుఁడే. సగుణోపాసన చేయునంతవఱకు దాసుఁడుగనే యుండవలయును. తానే బ్రహ్మ ననుకొనరాదు. భక్తుఁడు శ్రీరాముఁడని యెవరిని భావించుచున్నాఁడో, జ్ఞాని ఆవస్తువునే బ్రహ్మ (ఆత్మ) గా భావించుచున్నాఁడు. ఉపాస్యవస్తువులో భేదములేదు. మార్గములో భేదము. కాని యీ మార్గమునఁ బోవువాఁడు 'సోఽహం' భావన చేయరాదు 'దాసోఽహమ్' భావన చేయవలయును.

దాసుఁడై దాస్యమునకు విముఖతను జూపరాదు. స్వామి కైంకర్యాదు లొనర్చుటయు, స్వామిప్రభువనియు, దాను దాసుఁడననియు భావించుటయు దాస్యమే కాఁగలదు. భగవంతుని ఆజ్ఞల నుల్లంఘింపరాదు. 'శ్రుతి స్మృతి ర్మమైవాజ్ఞా' అని గీతాచార్యులు చెప్పియేయుండిరి. శ్రుతి స్మృతులు భగవదాజ్ఞలనియు, వాని నుల్లంఘింపరాదనియు తెలియఁగవలయును. కొందఱు శాస్త్రములు మానవులు రచించిరని భావించుచు నుల్లంఘించుచుండెదరు. ఈ శాస్త్రములకు సంస్కారము చేయరాదు. వాటిని మార్చరాదు. మనఁకు తోఁచిన యర్థమును జెప్పరాదు. శాస్త్రవిహిత కర్మలనే ఆచరింపరాదు. బ్రహ్మకు, శివునకు, ఇంద్రాదులకుఁ బూజన మొనర్పరాదు. అనఁగాఁ బరత్వమిచ్చి పూజింపరాదను భావమే కాని ఆ దేవతలకు నమస్కరింపరాదని కాని, ఆనామమునే నోట నుచ్చరింపరాదని కాని కాదు. నీచమానవులకే తనయవసరము కొలఁది ద్రవ్యముకలవాఁడని కాని అధికారముకలవాఁడని కాని భావించి, వాని నచ్చిలము లేకున్నను నమస్కరించుచుండ దేవతలకు నమస్కరించుట తప్పా? ఎంతటి నీచ దేవతయైనను, మహాత్ముఁడగు మానవుని కంటె గొప్పవాఁడే. వేదములు బ్రహ్మరుద్రేంద్రాదులకు యజ్ఞములలో హవిస్సు లొసగుఁడని ప్రబోధించుచున్నవి. 'యజ్ఞోవైవిష్ణుః' అని శ్రుతివాక్యము. యజ్ఞము విష్ణుస్వరూపమే. దీనినిబట్టి అంగదేవతలుగా నే దేవతనైనను బూజింపవచ్చును. కాని పరత్వము తనయిష్టదేవతకే యీయవలయును. భగవంతుఁడు సర్వదేవతలలోను, జరాచరములం

మును వ్యాపించియున్నాఁడు. కావున తన యిష్టదైవ స్వరూప మునఁ గాక నితరదేవతకును నమస్కరింపవలయును, బూజింపవలయును. అన్యదేవతయే లేదు ఉన్నదంతయు నొకే తన యిష్టదైవమని భావించుటయే అనన్యభక్తి. ఈ యనన్యభక్తి కుదురువఱకు భేదభక్తి తప్పదు. 'వాసుదేవస్సర్వమ్' అని భావించువాఁడు తప్ప సర్వదేవతలలోఁ దనయిష్టదైవము జూడఁజాలఁడు. కావున అనన్యదేవతలను భావము కలిగియుండియుఁ దన యిష్టదైవమును సర్వత్ర చూడఁజాలనివాఁడు తన నిష్ఠ యభివృద్ధి చెందుటకుఁ దన యిష్టదైవమునే భావింపవలయును, బూజింపవలయును, నమస్కరింపవలెను.

అసచ్ఛాస్త్రములం దభిలాషయుండరాదు. తంత్రములు, కొన్ని ఆగమములు అసచ్ఛాస్త్రములే. లౌకిక శాస్త్రములన్నియు నిష్ఠకు భంగముకలిగించునుగావున నవియు నసచ్ఛాస్త్రములే. యగును. కావున వానియందు ప్రీతియుండరాదు.

శ్రుతులు, స్మృతులు, పురాణ సంహితాదులు సచ్ఛాస్త్రములు. వీని నవమానింపరాదు.

గురువును మనుష్యుఁడను కొనరాదు. 'ఆచార్యం మాం విజానీయాత్' ఆచార్యుని నన్నుగాఁ దెలిసికొనవలసినదని భగవంతుఁడే చెప్పియున్నాఁడు. అట్టి గురువును అవమానింపరాదు. తనకు శక్తి యున్నంతవఱకు అవమానమును గలుగనీయరాదు. ఇచ్చట 'గుర్వాదౌ' అని యుండుటచేఁ దల్లిదండ్రుల యెడలను గూడ భక్తి కలిగి యుండవలయుననియు, వారినిగూడ మానవులుగఁ జూడరాదనియు భావము.

దాసుఁ డెన్నటికిని స్వతంత్రుఁడు కారాదు. భగవత్పర తంత్రుఁడు కావలయును. స్వతంత్రము కలవాఁడు దాసుఁ డెన్నటికిని గాఁజాలఁడు. అహంకార మమకారము కలిగియుండ రాదు. ఏది చేసినను నీవు కాదు చేయునది. భగవత్ప్రేరణవల ననే జరుగుచున్నది. ప్రేరణ భగవంతునిదైనను, కార్యము, సంకల్పము జరుగునది మనస్సుచేతనే. మనస్సు త్రిగుణాత్మక మైనది. అది ఆయాగుణములను బట్టి వర్తించుచుండును. కావునఁ బ్రేరణకర్త పరమాత్మ కావున నాతనినే జ్ఞాపక ముంచుకొనవలయును. కావున నేకార్యమొనర్చినను అహం కారమును జెందరాదు. అట్లే మమకారమును జెందరాదు. ఈప్రపంచము 'నాది' యని అనుకొను వస్తువులన్నియును భగవంతునివే. దారాపుత్ర గృహారామ క్షేత్రాదులను భగ వంతుఁడు మనకు వాడుకొనుట కొసంగియున్నాఁడు. అది నశిం చినను, వృద్ధిలోనున్నను ఆయనవియే. వానికై పొంగుటగాని, క్రుంగుటగాని పనికిరాదు. సంసారమున బంధింపఁబడుటకు ముఖ్యమగు కారణము అహంకార మమకారములు కలిగి యుండుటయే. ఆ రెండును నశించెనా ద్వంద్వాతీతుఁ డగు టకు వీలుకలదు.

భక్తుఁడు ద్వాదశీవిముఖుఁడు కారాదు. ఇచ్చట ఏకాదశిని గూడ అభ్యాహారముగఁ దెచ్చుకొనవలయును. ఏకాదశివ్రతము చాలగొప్పది. అది హరివాసరము. ద్వాదశీ పారణతోఁగాని వ్రతసమాప్తి కాఁజాలదు. దశమీవిద్ధకాని దియు, ద్వాదశీయుక్తమగు నేకాదశియే శ్రీరామభక్తులకు

ముఖ్యము. ఆరోజున నుపవాసమొనర్చి భగవత్స్మరణలో మునిఁగి యుండవలెను. లేదా హరినామ సంకీర్తన మొనర్ప వలయును.

భక్తుఁడగువాఁడు అకృత్యము లొనర్పరాదు. శాస్త్రములలోఁ జెప్పఁబడిన నిషేధకార్యము లన్నియు నకృత్యములే. ముఖ్యముగఁ గామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్య, అసూయ, దంభ, ద్వేషాదులు ముఖ్యముగ మానవలయును. ముఖ్యముగఁ గామినీ, కాంచన, కీర్తి కాంక్షలను వర్జింప వలయును.

పైనఁ జెప్పిన వన్నియు స్వస్వరూప విరోధములు. వీటి నన్నిటిని బాగుగాఁ దెలిసికొనుటవలనను, గుర్వనుగ్రహము నను భగవంతునియందు తక్షణము ప్రీతికలుగఁగలదు. మొట్ట మొదట అగస్త్యుఁడు శ్రీరామచంద్రునియందు ప్రీతియెట్లు కలుగునని యడిగిన ప్రశ్నకు హనుమంతుఁడు అర్థపంచక జ్ఞానము వలనను, గుర్వను గ్రహమునను ప్రీతి కలుగునని చెప్పెను. గుర్వనుగ్రహము రావలయుననిన గురువును నిర్వంచనముగ, పరమ విశ్వాసముతో, కేవలము భగవంతుఁడను భావముతోఁ జతుర్విధ శుశ్రూషలవలద్వారా సేవింపవలయును.

శ్రీరామోపాసకుఁడగువాఁడు ఈ అర్థపంచక జ్ఞానమును, తత్త్వత్రయ జ్ఞానమును బాగుగాఁ దెలిసికొనవలయును. మాచే రచింపఁబడిన 'తత్త్వత్రయము' అను గ్రంథమును గూడ చదువవలయును.

శ్రీరామార్పణమస్తు.

# సాధన గ్రంథమండలి, తెనాలి.

## మా ప్రచురణలు

| | |
|---|---|
| *భగవత్ప్రాప్తి-ఉపాయములు | 0-4-0 |
| *నరసదాసు కీర్తనలు | 0-10-0 |
| హరినామమహిమ శతకము | 0- 4-0 |
| ఈశ్వరసాక్షాత్కారము | 0- 3-0 |
| శ్రీ సీతారామ శతకము | 0- 2-0 |
| * గీతా ప్రతిభ | 0-12-0 |
| •భాగవతకథ | 2- 0-0 |
| శ్రీత్రిపురాంతకేశ్వరశతకము | 0- 4-0 |
| *శ్రీత్యాగరాజ చరిత్ర | 0- 4-0 |
| శ్రీకాళహస్తీశ్వరశతకము | 0- 8-0 |
| *పరమసాధన | 0-12-0 |
| •అశ్వినమాహాత్మ్యము | 2- 0-0 |
| భారతీయతత్త్వశాస్త్రము | 2- 0-0 |
| *శ్రీరామ పూజావిధానము | 0- 4-0 |
| బదరీయాత్ర (3 వ కూర్పు) | 1- 0-0 |
| కల్యాణకుంజము | 1-4-0 |
| మానవధర్మము | 1- 0-0 |
| సిద్ధాంతకల్పవల్లి | 1-0-0 |
| ఉపాసనీబాబా (చిత్రపటములతో 204 పేజీలు) | 1- 8-0 |
| అష్టాదశశ్లోకగీత | 0-12-0 |
| భక్తితత్త్వము | 0-12-0 |
| *ముక్తిగీత | 0- 6-0 |
| గురుశిష్యులు (శ్రీరామకృష్ణ వివేకానందులు) | 1- 0-0 |
| పరమార్థతత్త్వము | 0-12-0 |
| సంకీర్తన మీమాంస | 1- 0-0 |
| శ్రీ శుకుడు | 0-12-0 |
| * రామనామప్రభావము | 0- 6-0 |
| హిందూకోడ్ బిల్ సమీక్ష | 1- 0-0 |
| రాధారహస్యము | 1- 4-0 |
| జడభరతుడు | 0-12-0 |
| పద్మపురాణము | 1- 0-0 |
| బ్రహ్మఖండము | |
| ఆదిమఖండము గ్లేజు 166 పే॥ | 1- 8-0 |
| అర్థపంచకము | 0-12-0 |

* ఈ గ్రంథములు కొలది ప్రతులు మాత్రమే కలవు.

• ఈ గ్రంథములకు ఎట్టి కమీషను యివ్వబడదు.

## రాబోవు గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| భక్తిరసాయనము | శివతత్త్వము | సదాచారము | విశ్వశాంతి |
| భక్తమీరాబాయి | అవతారములు | ఆదర్శభక్తుడు | ఉపాసన |

---

షరా :- రు/కు లోపు వి. పి. లేదు. రు 5/- లు మించిన ఆర్డరుకు రు 1/- కి 0-3-0 కమీషను యివ్వబడును.

# మా గ్రంథములు

| | | |
|---|---|---|
| భగవన్నామ ప్రభావము | .... | 0- 6-0 |
| శ్రీరామ పూజావిధానము | .... | 0- 4-0 |
| శ్రీరామనామ ప్రభావము | .... | 0- 6-0 |
| నవవిధ భక్తులు | .... | 1- 8-0 |
| సంకీర్తనమీమాంస | .... | 1- 0-0 |
| కలిసంతరణోపనిషత్తు | .... | 1- 0-0 |
| పరమార్థ తత్త్వము | .... | 0-12-0 |
| బ్రహ్మచర్యము | .... | 0- 6-0 |
| తత్త్వత్రయము | .... | 0- 4-0 |
| అర్థపంచకము | .... | 0-12-0 |
| భాగవతకథ 1వ భాగము | .... | 2- 0-0 |
| చైతన్య చరిత్రావళి 1వ భాగము | .... | 2- 8-0 |
| మహాసంకీర్తనము | .... | 0- 8-0 |

## అచ్చుకానున్న గ్రంథములు

భాగవత కథ 2, 3, 4, 5, 6, 7, 8, 9 భాగములు
ఒడియా బాబాజీ ఉపదేశములు 1, 2 భాగములు
శ్రీరామ పటము
ప్రణవప్రభావము
శ్రీరామ మంత్రానుష్ఠానము (200 పేజీల గ్రంథము)
ధ్యానపద్ధతి
సాధన క్రమము (ప్రథమ సోపానము)

పై గ్రంథములను అచ్చువేయింప దలచినవారు మా మందిర స్వామికి 200 కాపీల నొసంగి ఒక ముద్రణము నచ్చువేయించుకొన వచ్చును. ఈ పుస్తకములమీద వచ్చు ఆదాయము శ్రీరామశరణ మందిర స్వామికి చెందును. ఉత్తర ప్రత్యుత్తరములు ఇకపై వా రీక్రింది చిరునామాకు వ్రాయవలెను.

కుందుర్తి వేంకట నరసయ్య, బుద్ధాం (యాజలి పోస్టు)

# సాధన గ్రంథ మండలి, తెనాలి

స్థాపితము 1945

## మహారాజపోషకులు (శాశ్వతము రు. 116 లు)

| | |
|---|---|
| శ్రీ జిడ్డు లింగయ్యగారు | బందరు |
| ఈదర వేంకట్రావు పంతులుగారు | ఏలూరు |
| దరిశి జానకిరామయ్యగారు | కొత్తపాలెం (దరిశి తా॥) |
| తూములూరి వెంకటశివరామయ్యగారు | నెల్లూరు |
| బొంగరాల వీరాస్వామినాయుడుగారు | కాకినాడ |
| యేలెండ్ల శ్రీరాములుచౌదరిగారు | తెనాలి |
| శ్రీ చిల్లర వేంకట భానోజీ రామర్సు జమీందారువారు | పేరూరు |

## రాజపోషకులు (శాశ్వతము రు. 58 లు)

| | |
|---|---|
| శ్రీ రూపాకుల శివరాంగారు | హత్రాస్ |
| పాటిట్ల పాలంకయ్యగారు | గుంటూరు |
| దోనేపూడి వేంకట రమణమూర్తిగారు | కంభం |
| వేజెళ్ళ రాఘవయ్యచౌదరిగారు | జూపూడి |
| కలగర నాగభూషణచౌదరిగారు | ఏలూరు |
| యస్. కె. ప్రకాశరావుగారు | తెనాలి |
| స్థానం నరసింహారావుగారు | |
| కె. నరసింహారావుగారు | |
| పులిపాటి వెంకటేశ్వర్లుగారు | |
| బొంతా సత్యనారాయణ సోదరులు, జొన్నాదుల రామస్వామిగారు | |
| చదలవాడ నాగేశ్వరరావుగారు | |
| పెన్నా సీతారామారావుగారు | (హనుమకొండ) వరంగల్ |
| పులిపాక చినపున్నయ్యగారు | నిడుబ్రోలు |
| చెన్నుభొట్ల భానుమూర్తిగారు | కాకినాడ |
| బలాసు హమీదుగారు | అనకాపల్లి |
| జయంతి బుచ్చిరామశర్మగారు | ముక్తేశ్వరం |
| బోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు | చావలి |
| దొడ్ల వెంకట రామరెడ్డిగారుగారు | కావలి |

## పోషకులు ( ప్రతి సంవత్సరము రు. 25 లు )

శ్రీ దుగ్గిరాల సూర్యనారాయణమూర్తిగారు — తెనాలి
సంకా వీరభద్రయ్యగారు
పులిపాటి లక్ష్మీనారాయణగారు
పరిమి వేంకట సుబ్బారావుగారు
గట్టి లక్ష్మీనరసింహశాస్త్రిగారు
ప్రయాగ కృష్ణమూర్తిగారు
చుండూరు రామయ్యగారు
బూదరాజు వాసుదేవమూర్తిగారు — చీరాల
పోలిశెట్టి సోమసుందరంగారు — గుంటూరు
కొత్తూరు రామయ్య, కర్పూరపు రామకృష్ణమూర్తిగార్లు కంపెనీ
వినపాముల సీతారామయ్యగారు
బెండపూడి పేర్రాజుగారు — వాల్తేరు
చీమలపాటి గణేశ్వరరావు పంతులుగారు
స్వామ్యమృతానందతీర్థ, కలగ ఆంజనేయశాస్త్రిగారు — విజయవాడ
కలగ వెంకటనారాయణగారు — తోటవల్లూరు
సి. ఆనందరయ్యగారు — మదరాసు

## సభ్యులు ( ప్రతి సంవత్సరము రు. 10 లు )

శ్రీ కోటంరాజు కృష్ణారావుగారు — తెనాలి
ఇంద్రిక సాంబయ్యగారు
నేతి హరినారాయణగారు
విష్ణుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
ముక్కామల వేంకటాచలపతిరావుగారు
కోగంటి తిరుపతయ్యగారు
గాదేపల్లి వేంకటసుబ్బరావుగారు
మట్టిగుంట వీరభద్రరావుగారు
సిరిపురపు శ్రీరాములుగారు
ప్రత్తి సూర్యనారాయణగారు
అల్లంరాజు మాధవరావుగారు

| | |
|---|---|
| శ్రీ ముదిగొండ మృత్యుంజయుడుగారు | తెనాలి |
| కాజ వేంకట జగన్నాథరావుగారు | |
| గుడివాడ హనుమంతరావుగారు | |
| గోనుగుంట్ల సుబ్బారావుగారు | |
| లక్కరాజు వేంకట పాండురంగ విఠల్ శర్మగారు | |
| వినపాముల నారాయణగారు | |
| కాజ వేంకట నరసింహారావుగారు | |
| అద్దేపల్లి శ్రీమన్నారాయణమూర్తిగారు | |
| అక్కల వెంకటేశ్వర్లుగారు | |
| ఈదర సుందరరామయ్యగారు | |
| ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారు | |
| ఎ. సుందరరావుగారు | |
| దార్వేముల వేంకటేశ్వరశాస్త్రిగారు | |
| అల్లాడి వీరరాఘవస్వామిగారు | |
| ప్రొప్రైటర్సు రూబీ యింక్సు | |
| ప్రొప్రైటర్సు సారథిప్రెస్ | |
| త్రిపురమల్లు శ్రీరాములుగారు | |
| తాడేపల్లి హరినారాయణగారు | |
| ముక్కామల రామచంద్రరావుగారు | |
| కోటంరాజు ప్రసాదరావుగారు | |
| గోపరాజు కృష్ణమూర్తిగారు | |
| యమ్. సుబ్బరాయుడుగారు | |
| రూపాకుల సూర్యనారాయణగారు | |
| రావినూతల నరసింహారావుగారు | ఒంగోలు |
| తూములూరి శ్రీరామమూర్తిగారు | పినపాడు |
| పుచ్చా వెంకటకృష్ణమూర్తిగారు | దంతలూరు |
| వల్లూరు వెంకటేశ్వర్లుగారు | బాపట్ల |
| కె. మధుసూధనరావుగారు | |
| మామిడిపూడి వెంకటసుబ్బయ్యగారు | తిరుచునాపల్లి |
| యం. లింగమూర్తిగారు | మదరాసు |

| | |
|---|---|
| శ్రీ ఆర్. సాంబశివరావుగారు | మదరాసు |
| పిసిపాటి పిచ్చయ్యగారు | ఇంకొల్లు |
| జమ్మలగుల హరినారాయణగారు | |
| ఈదర సూరయ్యగారు | విజయనగరం |
| ఇసుకపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు | గార్లపాడు |
| పన్నాల లక్ష్మీనరసింహంగారు | గుంటూరు |
| పన్నాల రామకృష్ణయ్యగారు | |
| జొన్నలగడ్డ వెంకట సుబ్రహ్మణ్యంగారు | |
| మేళ్ళచెర్వు వీరాంజనేయశాస్త్రిగారు | |
| కూచిభొట్ల సుబ్బారావుగారు | |
| గరిమెళ్ళ వెంకటరమణ కామేశ్వరరావుగారు | గంగలకుర్రు |
| గరిమెళ్ళ శ్రీరామమూర్తిగారు | |
| శ్రీ దువ్వూరి వేంకటపతి సోమయాజులు జమీందారుగారు | |
| గొర్తి వల్లయ్యపంతులుగారు | అగ్రహారం |
| గవిని కాయన్నగారు | జంపని |
| రాళ్ళభండి వెంకట సీతారామశాస్త్రిగారు | బందరు |
| మద్దింశెట్టి బ్రహ్మయ్యగారు | అయినవిల్లి |
| విళ్ళ వెంకటస్వామిగారు | |
| మద్దాల వెంకట కామేశ్వరరావుగారు | కానపల్లిలంక |
| సమయమంతుల నాగేశ్వరరావుగారు | ర్యాలి |
| అల్లవరపు అన్నప్పగారు | మండేశ్వరం |
| సలాది బాపయ్యగారు | అనాతవరం |
| సరిపల్లె విశ్వనాథంగారు | |
| కొప్పర్తి కృష్ణమూర్తిగారు | ధవళేశ్వరం |
| బులుసు పాపయ్యశాస్త్రిగారు | రాజమండ్రి |
| బులుసు సత్యనారాయణగారు | |
| చింతలూరి రామారావుగారు | |
| ద్వారకదాస్ గిరిధరదాస్‌గారు | |
| టి. కనకరాజుగారు | |
| వాజపేయాజుల వెంకటేశ్వర్లుగారు | |

శ్రీ ఉండవల్లి శంకర కోటేశ్వరరావుగారు — రాజమండ్రి
యం. సోమేశ్వరరావుగారు
చిల్లా సుబ్బారాయశ్రేష్ఠిగారు
మానాప్రగడ శ్రీరాములుగారు — కొవ్వూరు
నండూరి రాఘవరాజుగారు
బులుసు వెంకటేశ్వర్లుగారు — కాకినాడ
చెరువు శివరామకృష్ణశాస్త్రిగారు — విజయవాడ
కాజ సూర్యనారాయణగారు
వావిలాల శ్రీనివాసరావుగారు
నందిపాటి రామయ్యగారు
కాంచనపల్లి కనకాంబగారు
మంథా సుబ్బారావుగారు — అమలాపురం
అప్పాద్వేదుల సీతారామయ్యగారు
కోట పాలయ్యగారు
మంగళపల్లి లక్ష్మీనారాయణశాస్త్రిగారు
యం. వెంకటసుబ్బారావుగారు
కస్తూరి రామచంద్రమూర్తిగారు
కె. జగన్మోహనరావుగారు — నేలకొండపల్లి
జి. లోకనాథశర్మగారు
యస్. పి. విశ్వనాథశర్మగారు — సికింద్రాబాద్
చిల్లా సుబ్బరాయసిద్ధాంతిగారు
గొర్తి రామమూర్తిగారు
చిపుకుల అప్పయ్యశాస్త్రిగారు
తాడేపల్లి శివరామకృష్ణయ్యగారు
ఆదిరాజు అన్నాజీరావుగారు — విజయనగరం
పసుమర్తి వీరభద్రస్వామిగారు
కె. యస్. యన్. పట్నాయక్ గారు
జోస్యుల వెంకట సత్యనారాయణమూర్తిగారు — భట్నవిల్లి
గొర్తి పళ్ళయ్యశర్మగారు — నేడునూరు
పడింపల్లి సత్యనారాయణరాజుగారు — అంబాజీపేట

| | |
|---|---|
| శ్రీ నూకల అమ్మన్నపంతులుగారు | నందంపూడి |
| వడ్లమాని కామేశ్వరరావుగారు | |
| నూకల లక్ష్మీనారాయణగారు | |
| గంటి సుబ్బారావుగారు | |
| చల్లా సుబ్రహ్మణ్యంగారు | నరేంద్రపురం |
| సూరిశెట్టి వెంకటస్వామినాయుడుగారు | మగటపల్లి |
| ద్విభాష్యం వెంకటసూర్యనారాయణగారు | చింతలూరు |
| బూదరాజు వెంకటసుబ్బారావుగారు | స్వర్ణ |
| జాగర్లమూడి కుప్పుసామిగారు | కారంచేడు |
| కొల్లూరు కోటయ్యచౌదరిగారు | మూల్పూరు |
| చిలికాల రమణారెడ్డిగారు | మారెళ్ళ |
| జవరం కోటిరెడ్డిగారు | వంకాలపాడు |
| కోట శ్రీనివాసరావుగారు | నెల్లూరు |
| పులిగెళ్ళ వెంకటకృష్ణయ్యగారు | |
| చతుర్వేదుల రామచంద్రయ్యగారు | |
| పసుమర్తి సత్యనారాయణగారు | కావలి |
| వద్దిరాజు రంగారావుగారు | హనుమకొండ |
| కె. మధుసూదనరావుగారు | |
| కురికాల వేణీరావుగారు | పరకాల |
| కురికాల వేంకటేశ్వరరావుగారు | |
| కురికాల వెంకటరామారావుగారు | |
| వద్దిరాజు వెంకటరంగారావుగారు | వరంగల్ |
| ఐ. వెంకట్రావుగారు | |
| యస్. సిద్ధాంతిగారు | |
| టి. యస్. మూర్తిగారు | |
| కె. గంగాధరరావుగారు | |
| పొట్లపల్లి సత్యన్నారాయణరావుగారు | బ్రహ్మన్వాడి |
| ఉప్పల శ్రీరామమూర్తిగారు | అనకాపల్లి |
| వేదాంతం వెంకటసత్యనారాయణశర్మగారు | అత్తోట |
| కోలగొట్ల సూర్యనారాయణరావుశ్రేష్ఠిగారు | పార్వతీపురం |

రాజపోషకులు:

శ్రీ దువ్వూరి అప్పల నరసింహం గారు — అనకాపల్లి

పోషకులు :

శ్రీ బ్రహ్మాండం వెంకట లక్ష్మీ నారాయణశాస్త్రి గారు — బాపట్ల

సభ్యులు:

శ్రీ లొల్ల శంకర శాస్త్రి గారు — కొల్లూరు
శ్రీ పురాణం వెంకట సత్యనారాయణశాస్త్రి గారు — బందరు
శ్రీ జి. వరదరావు గారు — రాజమండ్రి
శ్రీ తణికెళ్ల రామకృష్ణమూర్తి గారు — కొత్తపేట
శ్రీ పి. పాపయ్య రాజు గారు — పెదపాడు
శ్రీ నరహరి గోపాలాచార్యులు గారు — కొండాడ
శ్రీ నిడమానూరి కనకరాజు గారు — తెనాలి

